# అమెరికన్ కాపిటలిజం

మాసిమో సాల్వడోరి

అమెరికా సమాచార కార్యాలయం

"అనేకమందిని కొలదిమంది తమ స్వప్రయోజనానికి ఉపయోగించుకొనే పాతకాలపు కాపిటలిజం కాదు మనది.... మనది కొత్తరకం కాపిటలిజం.... మన ప్రజలలో పరిశ్రమలకు సొంతదారులవుతూ, పరిశ్రమలలో సరకులు హెచ్చుగా ఉత్పత్తి అవుతున్నందువల్ల ప్రయోజనాలు పొందుతూవున్న వారి సంఖ్య నిత్యమూ పెరుగుతున్నది — హెచ్చు జీతాలు పొందడం, తాము కొనగలిగిన ధరలకు కొల్లలుగా సరకులను పొందడం మొదలైనవి ఈ ప్రయోజనాలు."

న్యూయార్క్ టైమ్స్
**15–2 '56**

ఈ పుస్తకాన్ని ఇంగ్లీషులో "Pall Mall Features" (123 **Pall Mall**, London, S. W. 1.) వారు మొదట ప్రచురించారు. కాపీలను వారివద్దనుంచి తెప్పించుకొనవచ్చు. ఒక్కొక్క కాపీ వెల 2 షిల్లింగుల 6 పెన్నీలు; లేదా 50 సెంట్లు.

# విషయసూచిక

పేజి

# అమెరికన్ కాపిటలిజం

## ఉపోద్ఘాతం

సంగ్రహం—కాపిటలిజం మీద తిరుగుబాటు—ఉదారవాద పరిస్థితి—కాపిటలిజం మీద విమర్శ—స్వేచ్ఛావ్యవస్థల సర్వనాశనం—ఆర్థికరంగంలో ఉద్రిక్తత, మితవాదం తీసికట్టు—స్వేచ్ఛ, ఆర్థిక వ్యవస్థలు.

**కాపిటలిజం మీద తిరుగుబాటు**

చాలా హెచ్చు దేశాలలో రాజకీయ విషయాలను గ్రహించినవారిలో అత్యధిక సంఖ్యాకులు కాపిటలిజానికి వ్యతిరేకులు. కొన్నాళ్ళుగా వారికి కాపిటలిజమంటే కిట్టడం లేదు. మూడవ వంతు మానవకోటిని గుప్పిటలో పెట్టుకొన్న కమ్యూనిస్టు డిక్టేటర్ల దేశాలలో కాపిటలిజానికి స్వస్తి చెప్పడం మనకు తెలుసు. మిగతా రెండు వంతులలో కాపిటలిజం ఏమవుతుందో మనకు అంతగా తెలియదు. యూరపియన్ ప్రజాస్వామిక దేశాలలో చాలా వాటిలోను, కొన్ని కామన్వెల్త్ దేశాలలోను, కొన్ని దక్షిణ అమెరికా దేశాలలోను ఇప్పటికీ మిగిలివున్న కాపిటలిజం ఒడుదుడుకులలో వున్నట్టు కనిపిస్తుంది. స్వేచ్ఛగా, లేదా తగినంత స్వేచ్ఛగా, ఎన్నికలు జరగడానికి అవకాశంవున్న 17 యూరపియన్ దేశాలలో సుమారు సగం మంది ప్రజలు సమష్ఠి వ్యవస్థను (Collectivism) వెంటనే నెలకొల్పుతామనే పార్టీలకో, లేదా అదే తమ అంతిమ లక్ష్యం అనే పార్టీలకో వోట్లు ఇస్తారు; దక్షిణ అమెరికా డిక్టేటరుషిప్పులకు, ఐబీరియన్ డిక్టేటరుషిప్పుకు విశిష్ట లక్షణమైన కార్పొరేట్ ఆర్థిక వ్యవస్థను లక్ష్యంగా పెట్టుకొని వేర్వేరు పేర్లు గల పార్టీలవారికి సుమారు మూడవ వంతు మంది వోట్లు యిస్తారు. ఇటీవలి దశాబ్దాలలో స్వాతంత్ర్యం పొందిన దేశాలు కొన్నీ, స్వాతంత్ర్యం పొందబోతున్న దేశాలుకొన్నీ వున్నాయి. గోల్డుకోస్టునుంచి ఇండొనీసియా వరకు అనేకంగావున్న ఈ దేశాలను రాజకీయ, సాంఘిక విప్లవాలగుండా నడిపిస్తున్న శక్తియుత వర్గాలకు కాపిటలిజమంటే చెప్పలేనంత వెగటు; దురదృష్టమేమిటంటే, తాము అభ్యుదయగాములమనుకొనేవారు పురోభి

వృద్ధికి కాపిటలిజం పరమ శత్రువని భావిస్తారు. అమెరికా, కెనడాలలో కాపిటలిజం విజయవంతమై వున్నప్పటికీకూడా, కాపిటలిజం వ్యతిరేకతత్వం పెచ్చుపెరుగుతూంది.

ఉదారవాద పరిస్థితి

రాజకీయ రంగానికి ఒక వైపున సాంప్రదాయ తత్వం, మత తత్వం, జాతీయతత్వం వున్నాయి. రెండవవైపున సోషలిజం, కమ్యూనిజం వున్నాయి. ఈ ఉభయపక్షాలవారుకూడా ఆర్థిక వ్యవస్థను రాజకీయ వ్యవస్థనుంచి వేరుచేయ రాదనీ, ప్రభుత్వమే ఆర్థికరంగంమీద పెత్తనం కలిగివుండడమో, కంట్రోలు కలిగి వుండడమో, లేదా అజమాయిషీ కలిగివుండడమో జరగాలనీ వాది స్తున్నారు. కాపిటలిజం వెలుగొందడానికి ఆర్థికస్వేచ్ఛ కారణం. స్వేచ్ఛకు శత్రువులైనవారు కాపిటలిజాన్ని నిర్మూలించాలని తలపోస్తారు. వారంతకంటె ఇంకేం చేస్తారనుకుంటాం? మనం ఉదారవాదులం గనుక మనకు అటువంటి వారితో ప్రసక్తి లేదు. అయితే, స్వేచ్ఛ పేరుతో ఆర్థిక స్వేచ్ఛను నిర్మూలించ దలచినవారి విషయాన్ని మనం పట్టించుకోవాలి. ఇటువంటివారు అనేకమంది వున్నారు. ఉదారవాదులూ, లోక్ మొదలు మిరాబూ వరకూ, జఫర్సన్ మొదలు స్టెయిన్‌వరకూ వున్న వీరి పూర్వీకులైన ఉదారవాదులూ ఆక్రమించిన స్థానాన్ని పడగొట్టాలని ఇటువంటివారి తలంపు. దేశసౌభాగ్యానికి ఆర్థికస్వేచ్ఛ మూల కారణం కాగలదని మాత్రమేకాక, ఆర్థిక కార్యకలాపాలలో స్వేచ్ఛ ప్రతి వారికి వున్న తిరుగులేని హక్కు అని కూడా ఈ ఉదారవాదులు భావించారు. ప్రభుత్వాన్ని, ఆర్థికవ్యవస్థను వేరుచేయడం వలన (పూర్తిగా వేరుచేయడమని కాదు) స్వతంత్ర కామన్వెల్త్ వ్యవస్థ ఏర్పడగలదని ఉదారవాదులు ఊహించ గలిగారు. ప్రభుత్వాన్ని, మతవ్యవస్థను వేరుచేయడం ఎంత ముఖ్యమైనదో ఇది అంతకంటె తక్కువది కాదనీ, రాజకీయ వ్యవస్థలో అధికారాల విభజన కంటె ఇది తక్కువ ముఖ్యమైనదికాదనీ వారు ఊహించగలిగారు.

కాపిటలిజంమీద విమర్శ

తాము స్వేచ్ఛాప్రియుల మనుకొంటున్న మైనారిటీ వర్గాలలో అనేకమంది స్వేచ్ఛ అనే పదాన్ని, కాపిటలిజం అనే పదాన్ని ఒకే సందర్భంలో వాడడానికి సంకోచిస్తారు. మానవుని మనుగడకు స్వేచ్ఛయే మూల

కారణమని భావించి, స్వేచ్ఛాదృష్టితో చూస్తే కాపిటలిజం (లేదా కనీసం కొన్ని రకాల కాపిటలిజం) ఇతర ఆర్థిక విధానాలకంటె నిశ్చయంగా ప్రయోజనాలు కూర్చగలదని నమ్మినవారు సయితం ఆ పదాన్ని వాడకుండా జాగ్రత్త పడుతారు. దానికి బదులుగా ప్రయివేటు ఆర్థిక విధానమనో, వ్యష్టి సాహస కార్యమనో, లేదా యధేచ్ఛా వ్యాపారమనో మాట్లాడడంగాని, వ్రాయడంగాని చేస్తారు. కాపిటలిజం వృద్ధి అవడంవల్లనూ, టోయిన్‌బీ చెప్పినట్లు సాంప్రదాయాల పీడను నిర్మూలించే విప్లవాత్మక శక్తి దానికి వుండడంవల్లనూ మానవప్రయత్నం జరిగిన ప్రతిరంగమూ సజీవంగా విస్తృతమైందని ఎవరు చెబితే వారిని అభివృద్ధి నిరోధకు లంటారు. లేదా, కనీసం కరుడుగట్టిన కన్సర్వేటివు లని అయినా ముద్రవేస్తారు. అటువంటి వారికి ఆర్థికోపద్రవాలు, దారిద్ర్యం, నిరుద్యోగ సమస్య, సాంఘిక సంఘర్షణలు, దురాక్రమణ యుద్ధాలు కాపిటలిజంవల్లనే వచ్చాయని వెంటనే చెబుతారు—ఇవి కాపిటలిజంతో నిమిత్తం లేని ఆర్థిక వ్యవస్థలలో ఎక్కువగా కలగనట్లు. 50 శతాబ్దాలకు పూర్వం గల ఫారోలనాటి సమష్టి వ్యవస్థ మొదలు 1956 నాటి సోవియట్ సమష్టి వ్యవస్థ వరకు కాపిటలిజంతో నిమిత్తంలేని ఇతర వ్యవస్థ లున్నాయి. ఇవి రాజరిక దేశాలు, జమీందారీ దేశాలు, వ్యాపార దృష్టిగల దేశాలు మొదలైనవి. సామాన్యంగా వీటిలోనే కాపిటలిస్టు దేశాలలోకంటె ఎక్కువగా యుద్ధాలు, సాంఘిక సంఘర్షణలు మొదలైనవి జరుగుతూండేవి.

స్వేచ్ఛావ్యవస్థల సర్వనాశనం

ఆర్థిక భద్రత, సుస్థిరతల పేరుతో, సౌభాగ్య సంక్షేమాల పేరుతో ప్రజాప్రాతినిధ్య సంఘాలను—స్వేచ్ఛగా ఎన్నుకోబడిన పౌర ప్రతినిధులు అసెంబ్లీలలో చర్చలు జరిపే ప్రభుత్వాలను—తూర్పారబట్టి, నాశనం చేసి వేశారు. ఆసియా, దక్షిణ అమెరికాలలోవలెనే యూరప్‌లోకూడా, ప్రతివ్యక్తికీ అత్యంత స్వాధికారం ఇచ్చే ప్రజాప్రభుత్వానికేమి, విభిన్న ఆశలూ ఆశయాలూ గల స్వతంత్ర పౌరులు ప్రజాస్వామిక పద్ధతిద్వారా శాంతియుత సహజీవనం కలివుండడానికై జరిగే మహనీయ ప్రయత్నానికేమి ఏకవర్గ ప్రభుత్వం విరుద్ధమైనది. ఏకవర్గ ప్రభుత్వం చెప్పినట్లల్లా ప్రజలు నడుచుకోవాలి. అది వారిని ఒకే మూసలో తయారైన మనుష్యులులాగ చేస్తుంది. ఈ ఏకవర్గ ప్రభుత్వం మరీ దారుణస్వరూపం దాల్చినప్పుడు నిరంకుశ

ప్రభుత్వ మవుతుంది. సాంప్రదాయంగా వుంటూవచ్చిన ఏకచ్ఛత్రాధిపత్యానికీ ఈ నిరంకుశ ప్రభుత్వానికీ తేడావుంది. ఎలాగంటే, శాస్త్రజ్ఞానం అభివృద్ధి అయిన కొలదీ ప్రజలు నైపుణ్యవంతులు అయ్యే అవకాశం నిరంకుశ ప్రభుత్వంలో తక్కువ. ఇంకా ముఖ్యమైన తేడా ఏమిటంటే, నిరంకుశ ప్రభుత్వంలో ప్రజలకు సమష్టి ఆర్థిక వ్యవస్థల రూపంలోనో, వర్గ ఆర్థిక వ్యవస్థల రూపంలోనో సంకెళ్ళు తగులుకుంటాయి; రాజకీయ, బౌద్ధిక విషయాలలో వారికి స్వేచ్ఛ వుండదు. (నాజీ జర్మనీ, మిలిటరీ తత్వంగల జపానూ 1945 లో పతనమైనప్పటికీ, సుమారు 80 స్వతంత్రదేశాలలో నియంతృత్వ ప్రభుత్వాలు గల దేశాలు ఇరవైకి తక్కువ కాకుండా వున్నాయనే సంగతి మనం గ్రహించకపోవచ్చు. ఈ ఇరవైలో సుమారు 14 దేశాలలో కమ్యూనిజాన్ని పోలిన ప్రభుత్వాలు, సుమారు ఆరు దేశాలలో ఫాసిజాన్ని పోలిన ప్రభుత్వాలు వున్నాయి). ఏకవర్గ ప్రభుత్వం సామాన్య స్వరూపంలో వున్నట్లయితే అది ప్రాతినిధ్య వ్యవస్థలనూ, పౌరులు అంతకు పూర్వం అనుభవిస్తూ వచ్చిన రాజకీయ స్వాతంత్ర్యంలో తగినంత ఎక్కువ భాగాన్నీ అట్టేపెడుతుంది; కాని, పౌరులలో బాధ్యతాదృష్టిని తగ్గింపజేసి, వారి అధికారాన్ని పరిమితం చేస్తుంది. వీటివలన ఆ దేశం చాలావరకు జీవచ్ఛవమైపోవడం, ప్రజలు ఎటువంటి మార్పులకు లోను కాకుండా వుండడం జరుగుతుంది. కనుక, ఇటువంటి పరిస్థితి భౌతిక సంపదాభివృద్ధికిగాని, ఆధ్యాత్మికాభివృద్ధికిగాని ఎంతమాత్రం పనికిరాదు.

ఆర్థికరంగంలో ఉద్రిక్తత, మితవాదం తీసికట్టు

మతకలహాలు లేకుండా ప్రజలు సహనపరులైవున్న దేశాలలో ఉదారవాదం జన్మించింది. 20 వ శతాబ్దంలో కాపిటలిజం అభివృద్ధి అయిన తరువాత వచ్చిన ఆర్థిక కల్లోలంవల్ల ఉదారవాదం నాశనం చెయ్యబడిందనీ, తత్ఫలితంగా కొత్త వాదాలు వెర్రిఆవేశంతో తలలెత్తాయనీ ఒప్పుకుతీరాలి. అంతేకాదు. యూరప్‌లోని పెద్దరాజ్యాలలో కాపిటలిస్టుల చర్యలు తరచు బుద్ధిపూర్వకంగా—కనీసం గత తరంలో—స్వేచ్ఛను అణచి వేయడానికి ఉద్దేశించబడినవని ఒప్పుకు తీరాలి. జర్మనీ, ఫ్రాన్సు, ఇటలీ, స్పెయిన్ దేశాల అనుభవాన్ని బట్టిచూస్తే, స్వేచ్ఛకు కాపిటలిజం బద్ధవిరోధి అనే సోషలిస్టు వాదాన్ని సమర్థించడానికి తగినంత ఆధారం కనిపిస్తుందనికూడా ఒప్పుకు

తీరాలి. దురదృష్టమేమంటే, కాపిటలిజాన్ని అనుసరించడమా, దానికి వ్యతిరేకమైనదాన్ని అనుసరించడమా—ఈ రెండింటిలో ఏదో ఒకటి మాత్రమే శరణ్యమని యూరపియనులు చాలా హెచ్చుగా భావించి, ఆ విధంగా ప్రవర్తించడం జరిగింది. అంతేగాని, ఉదార ప్రజాస్వామిక రాజ్యంలోని సంస్థలలో స్వేచ్ఛ పాదుకుపోయింది గనుక, కాపిటలిజాన్ని సంస్కరించుకుందామనో, లేదా కొత్తరకం కాపిటలిజాన్ని అనుసరించుదామనో వారు ఆలోచించనైనా లేదు. అలాచేస్తే, పూర్వంనుంచి వున్న కాపిటలిజంలోని లోపాలు నశిస్తాయనీ, స్వేచ్ఛావ్యాపారాన్ని, స్వేచ్ఛా పరిశ్రమలను రద్దుచేసే సమష్టివిధాన వ్యవస్థకంటెనూ, వర్గవిధాన వ్యవస్థకంటెనూ ఇది ఉత్తమమైనదిగా వుంటుందనీ వారు ఆలోచించ లేదు.

స్వేచ్ఛ, ఆర్థిక వ్యవస్థలు

అనేక దేశాలు వివిధ ఆర్థిక విధానాలను అనుసరించి ప్రయోగాలు జరపడమైనది గనుక, స్వేచ్ఛకు, ఆర్థిక వ్యవస్థలకు సముచిత సంబంధం వుండాలనే సమస్యను వీలైనంత సహేతుకంగా పునఃపరిశీలన చేయాలి. ఇందునిమిత్తమే ఈ పుస్తకం రచించబడింది. దీనిలో, యూరప్‌లో పరిణమించిన కాపిటలిజం పద్ధతులకు అమెరికన్ పద్ధతికి తేడా వుందనేది ఈ రచయిత సిద్ధాంతం. ప్రజలు స్వేచ్ఛాపరులై వుండడంకోసం ఉద్దేశించబడిన వ్యవస్థలను అమెరికన్ కాపిటలిజం శక్తిమంతం చేస్తుందని ఈ రచయిత సిద్ధాంతం. అమెరికన్ కాపిటలిజంలోని కొన్ని అంశాలను, అది సాధించిన కొన్ని ఫలితాలను, ఆ దేశం ప్రస్తుతస్థితికి కారణభూతమైన కొన్ని విషయాలను తరచు అలక్ష్యం చెయ్యడమో, లేదా వాటివిలువ గ్రహించక పోవడమో జరుగుతున్నది. సంఖ్యలతో, తదితర సాక్ష్యాలతో ఇదివరలో బోలెడు విమర్శ జరిగింది; ఇప్పటికీ జరుగుతున్నది. ఈ విమర్శ సరియైనదీ, అవసరమైనదీ కూడా. విమర్శించడం తేలిక: మానవుడు ఏది చేసినా లోపం వుంటూనే వుంటుంది. అయితే, అమెరికన్ కాపిటలిజంలో విలక్షణమైన ఒక ముఖ్య విషయం వుంది. ప్రతి వివేక వంతుడు గ్రహించవలసిన విషయం అది.

---

# II యూరపియన్ కాపిటలిజమేదో అదే అమెరికన్ కాపిటలిజం కాదు

సంగ్రహం—ఉదారవాదంలో ఆర్థిక స్వేచ్ఛ ముఖ్యాంశం—ఈ సమస్యకు జీవం ఆస్తిపాస్తులు—ఆస్తి కొద్దిమందికా, చాలామందికా?—యూరపియన్ కాపిటలిజం; అదొక ప్రత్యేక సౌకర్యం—యూరపియన్ పద్ధతి—అమెరికన్ పద్ధతి—విభిన్న మార్గాలు—కొన్ని విభేదాలు—మనసారా ఇష్టంలేని ఆర్థిక స్వేచ్ఛ—మనసారా ఇష్టంవున్న ఆర్థిక స్వేచ్ఛ—అరాచకం, శాసనబద్ధ రాజ్యాంగం—మంకుపట్టుతో ప్రయత్నం—జెఫర్సన్ నుంచి ఐసెన్ హోవరు వరకు—సాంఘిక సంస్కరణలకు ఆందోళన—సోషలిజంలోని ఆకర్షణ—సాంఘిక సంస్కరణలు ఆర్థిక స్వేచ్ఛకు అనుగుణమైనవి.

**ఉదారవాదంలో ఆర్థిక స్వేచ్ఛ ముఖ్యాంశం**

19 వ శతాబ్దంలోని ఉదారవాదులూ (లిబరల్సు), వారికి పూర్వం 17 వ, 18 వ శతాబ్దాలలోని ఉదారవాదులూ ఆర్థిక స్వేచ్ఛ వుండాలని రాజకీయ, ఆర్థిక కారణాలను పురస్కరించుకొని సమర్థించారు. వారి వాదంలోని విషయాలు ఇవి: (1) ఆస్తిపాస్తులు వ్యక్తిపరమై వుండడం మంచిది; పూర్వకాలంలో ప్రభుత్వం క్రిందవున్న సమష్టి పద్ధతికంటెనూ, ప్రయివేటు వ్యక్తులక్రింద వున్న సమష్టి పద్ధతికంటెనూ కూడా ఇది నిస్సందేహంగా ఉత్తమమైనది. (2) ఆస్తిపరులగు పౌరులూ, లేదా ప్రత్యక్షంగానో పరోక్షంగానో వారి ఏజంటులైనవారూ ఆస్తిని నిర్వహించడంలో హెచ్చు బాధ్యత కలిగివుండి తీరాలి. (3) సాధ్యమైనంత ఎక్కువ స్వేచ్ఛగల వాతావరణంలో ఆర్థికకార్యాలు జరిగినప్పుడు వాటివల్ల అత్యుత్తమ ఫలితాలు కలిగాయి. వ్యాపారాదులు పూర్తిగా ప్రభుత్వ వశంలో గాని, కొందరు వ్యక్తుల వశంలోగాని వుండరాదనీ, పౌరుడు సొంత ఆర్థిక యత్నాలు చేసుకోలేకుండా వానిని పిప్పిచేస్తున్న బీరకాయ పీచులాంటి శాసనాదులు, నిర్బంధాలు వుండరాదనీ ఉదారవాదులు చేసిన ఆందోళన విజయవంతమైంది. ఆస్తిపాస్తులపై హక్కు గురించిన పూర్వ శాసనసంస్థానే ఒక కొత్త సులభశాసనం వచ్చింది. స్వేచ్ఛావ్యాపారం మొట్టమొదట బ్రిటనులోను, ఆ తరువాత అమెరికాలోను,

పిదప యూరపియన్ దేశాలలోను బయలుదేరింది. ప్రభుత్వంగాని, వ్యాపార వర్గాలుగాని విధించిన పరిమితులేవీ లేవుగాని వ్యాపార పరిస్థితులవల్ల ఏర్పడిన పరిమితులు వున్నాయి. వాటికి లోబడి పౌరులు ఉత్పత్తులు చేసుకోవచ్చు; పనులకు కార్మికులను, పెట్టుబడికి ధనాన్ని వినియోగించుకోవచ్చు. పౌరులు తాముఉత్పత్తి చేసిన వాటిని తాము ఉపయోగించుకోవచ్చును. వీటన్నింటికీ తగినంత స్వేచ్ఛ ఏర్పడింది. అయితే, బ్రిటన్‌లో లోక్, స్మిత్‌లుగాని, అమెరికన్ రిపబ్లిక్ సంస్థాపకులుగాని, ఫ్రాన్సులో సంస్కర్తలు, విప్లవకారులుగాని కాపిటలిజం వృద్ధిని ఊహించలేదు (ఈ కాపిటలిజం జన్మించిన పరిస్థితులు ఇవి: అప్పటి బ్రిటిష్, అమెరికన్, ఫ్రెంచి ప్రజలలో మధ్య తరగతులు శక్తిమంతమైనవి. వారు అమూల్యంగా భావించిన నీతి నియమాలు, సూత్రాలు మొదలైనవాటి ఫలితంగా రాజకీయ, బౌద్ధిక స్వాతంత్ర్యం గల వాతావరణం ఏర్పడింది. దీనిలో స్వేచ్ఛా వ్యాపారం వుండేది. ఎవరి ఆస్తిపాస్తులకు వారే సొంతదారులు. తత్ఫలితంగా కాపిటలిజం జన్మించింది).

ఈ సమస్యకుజీవం ఆస్తిపాస్తులు

1688 లో బ్రిటనులోను, 1776 లో అమెరికాలోను, 1789 లో ఫ్రాన్సులోను విప్లవాత్మక ఉద్యమాలకు సారధ్యం వహించినవారు తమ తమ దేశాలలో స్వాతంత్ర్య పత్రాల రచనలకు బాధ్యులు. (ఆ పత్రాల పేర్లు ఇవి: బ్రిటిష్ బిల్లులు, చట్టాలు; అమెరికా స్వాతంత్ర్య, రాజ్యాంగ ప్రకటన; 1791 లో ఫ్రాన్సులో చేసిన మానవ హక్కులు, రాజ్యాంగం ప్రకటన). పూర్వీకులకు తెలిసినంత స్పష్టంగా వీరికికూడా ఆస్తికి, స్వేచ్ఛకు సన్నిహిత సంబంధం వున్నదని తెలుసు. క్రీస్తుకు పూర్వం 6వ శతాబ్దంలో ఏథెన్సులోను, 5 వ శతాబ్దంలో రోములోను జరిగినట్టుగా, ఆస్తిపాస్తులున్నవారికే రాజకీయ హక్కులు వుండాలని వీరనుకున్నారు. పూర్వీకుల అనుభవాన్ని, ఆధునికుల అనుభవాన్ని బట్టిచూస్తే వీరు తప్పు చేశారని ఎవరైనా అనగలరా?

ఆస్తి కొద్దిమందికా, చాలా మందికా?

అనేకమంది ఉదారవాదులు తరతరాలుగా పొరపాటుచేశారు (కొందరు ఇప్పటికీ చేస్తున్నారు). కాని స్వేచ్ఛాయుతసంఘంలో వ్యక్తి తన ఆస్తికి తనే సొంతగాడవడంవల్ల అతడు వహించే పాత్ర[illegible]ంలో మాత్రం వారు పొరపాటు

పడలేదు. అసంఖ్యాక ప్రజలు ఆస్తిపాస్తులకు సొంతదారులు కాకుండా అవరోధించే పరిస్థితులను నిర్మూలించడానికి వారు ఇష్టపడ లేదు. ఇది వారు చేసిన పొరపాటు. 1688 కి పూర్వం బ్రిటనులోను, 1789 కి పూర్వం యూరప్‌లోను ఆస్తి వుండడం ఒక "ప్రత్యేక సౌకర్యం"; అది ప్రత్యేక సౌకర్యంగానే వుండిపోయింది; 19 వ శతాబ్దంలో దానికి మరీ ప్రాముఖ్యం వచ్చింది; ఆస్తి వుండడం ప్రత్యేక సౌకర్యం క్రిందకు పరిణమించింది గనుక, స్వేచ్ఛా సంఘానికీ, దానికీ ఎంతమాత్రం సరిపడదు. రోమన్ కామన్వెల్తులో శ్రామిక వర్గం వృద్ధి కావడంతో స్వేచ్ఛ సన్నగిలింది; ఉదారవాదంనుంచి జనించిన కాపిటలిజం పెరిగిన కొలదీ, కాపిటలిజం ఆ ఉదారవాదాన్నే దుర్బలం చెయ్యడమో, శ్రామికవర్గాన్ని వృద్ధి చెయ్యడమో జరిగింది. కాని, ఆస్తిపాస్తులకు భాగస్వాములయే వారి సంఖ్య ఎక్కడైతే పెరిగిందో అక్కడ ఉదారవాదాన్ని, దానివల్ల ఏర్పడిన వ్యవస్థలను కాపిటలిజం బలపరచింది. ఈ విధంగా అమెరికా, కెనడాలలోను, యూరప్, దక్షిణ అమెరికాలలోవున్న కొన్ని చిన్న ప్రజాస్వామిక దేశాలలోను జరిగింది; అదృష్టవశాత్తు, అదే విధంగా (ఇప్పటికీ చాలా ఎగుడుదిగుడుగా వున్నప్పటికీ) ఫ్రాన్సులో కూడా జరిగింది. అక్కడ భూములున్నవారు, పరిశ్రమలు మొదలైనవాటికి ధనం పెట్టుబడిగా పెట్టి భాగస్వాములైనవారు కలిసి సుమారు సగం మంది వున్నారు. కాబట్టి, ప్రజలు సొంతదారులు కావడంవల్ల రాజకీయ వ్యవస్థలోని లోపాలు కనిపించవు. ఆస్తిపాస్తులు లేని శ్రామికవర్గం రాజకీయంగా స్వేచ్ఛలేనివారనీ, ఉదార ప్రజాస్వామ్యంమీద తిరగబడుతారనీ సోషలిస్టులు అంటున్నది నిజం. ప్రజాస్వామ్యం అనగానే మొట్టమొదట గుర్తుంచుకోవలసిన విషయం అదొక విధానమనే విషయం. అయితే, తుదకు కాపిటలిజాన్ని నిర్మూలించ నిశ్చయించుకొనే శ్రామికవర్గం ఏర్పడడానికే ఆ కాపిటలిజం దారితీస్తుందని సోషలిస్టులు భావించడం పొరపాటు. ఎవరికీ ఆస్తిపాస్తులు వుండరాదనీ, అందరూ సమష్టి పద్ధతిలో సొంతదారులు కావాలనీ సోషలిస్టులు నిశ్చయించడంచేత, యూరపియన్ కాపిటలిజంలోవున్న కొంత తప్పును వారు పూర్తి తప్పుగా చేసివేశారు. తద్విధంగా వారు 20 వ శతాబ్దపు సమష్టి నియంతృత్వానికి దారిచేశారు.

**యూరపిన్ కాపిటలిజం; అదొక ప్రత్యేక సౌకర్యం**

20 వ శతాబ్దం పూర్వార్థభాగంలో యూరపియన్ స్వాతంత్ర్యం సన్నగిలడానికి ఏవి కారణాలో వాటి సారాంశాన్ని భావి చరిత్రకారుడు ఈ విధంగా పేర్కొనడం జరగవచ్చు: (1) 20 వ శతాబ్దారంభంలో కాపిటలిజం ఇంకా విస్తృతం అవుతూవుంది; అంతకుముందు నూరు సంవత్సరాలుగానో, ఇంకా ఎక్కువగానో అది ముఖ్యపాత్ర వహించింది; కొలది మందికి అది మితిమీరిన ప్రయోజనం కలిగిస్తూ, యూరప్‌లోని అధిక భాగంలో ఒక "ప్రత్యేక సౌకర్యంగా" వుంటూ వచ్చింది; సొంత ఆస్తులుగల వారినీ, శ్రమజీవులనూ అది అంతకంతకు దూరంచేస్తూ, వర్గ విభేదాన్ని మరింత ప్రగాఢం చేసింది; శ్రమజీవులకు చాలా హెచ్చుగా బాధ కలిగించింది. (2) స్వేచ్ఛ పేరుతో సోషలిజం, ఎవరికీ ప్రత్యేక సౌకర్యం వుండకూడదని చెప్పింది; సమానత్వం పేరుతో, వర్గవిభేదాన్ని వ్యతిరేకించింది; మానవత్వం పేరుతో, ఎవరూ బాధపడరాదన్నది—ఫ్రెంచి విప్లవాశయాలు మూడింటి పేరుతో, కాపిటలిజం వల్లకాదన్నది—అందుచేత సోషలిజం చటుక్కున బుద్ధి జీవులలో అధిక సంఖ్యాకుల ఆదరణను, ప్రజానీకం హృదయాలను చూరగొన్నది. ఆస్తులుగలవారు సోషలిజానికి భయపడి, ఆస్తిమీద వ్యక్తులకు హక్కు వుండాలనే ఉద్యమాలను బలపరచారు. కాని, కాపిటలిజాన్ని నిలబెట్టడానికే కాక, సోషలిజం వృద్ధికావడానికి కూడా కారణమైన స్వేచ్ఛను వారు ప్రతిఘటించారు. (3) అధికారంకోసం వివిధవర్గాలవారు సంఘర్షించిన ఫలితంగా కాపిటలిజం స్థానే మూడు పద్ధతుల ఆర్థిక వ్యవస్థలు వచ్చాయి; సోషలిజం విజయంపొంది స్వేచ్ఛగా నిలచివున్నచోట అది సమష్టివాదం ప్రవేశపెట్టింది. ఆచరణలో సమష్టివాదానికి స్వేచ్ఛకు పొత్తు కుదరదని రుజువైంది. (ఉదార ఆర్థికవాదులు సిద్ధాంత రీత్యానే రుజువు చేసినట్లు) ఆర్థిక సూత్రాలతో సంబంధంలేని అభిప్రాయాల పలుకుబడిలోను, ఉదారవాద ఆశయాల పలుకుబడిలోను పడినమీదట కార్మిక వాదంగానో (లేబరిజం), సాంఘిక ప్రజాస్వామ్యంగానో (సోషల్ డెమాక్రసీ) ఆ సోషలిజం విజయం పొందినచోట అది వ్యాపార లాభం కలిగించే ఆర్థిక విధానాలను నూతన పద్ధతిలో ప్రవేశపెట్టింది—పూర్వపు శతాబ్దాలలో కాపిటలిజానికి ముందువున్న వ్యాపారలాభ విధానం ఎంత ఎదుగూ బొదుగూ లేనిదో సోషలిజం ప్రవేశ పెట్టినదికూడా అటువంటిదే; స్వేచ్ఛావాదానికి వ్యతిరేకులూ, సోషలిజానికి

శత్రువులూ అయినవారు విజయులైనచోట స్వేచ్ఛావ్యాపారాన్ని రద్దుచేసి, కాపిటలిజంస్థానే కొన్ని కూటాల ప్రాబల్యంలోనో, లేదా కొంతవరకు కొన్ని కూటాల ప్రాబల్యంలోనో వుండే ఆర్థిక విధానాలను ప్రవేశ పెట్టారు—ఇవి పూర్వకాలపు వ్యాపార ఆర్థిక విధానానికి ముందువున్న వర్గప్రాబల్య విధానాన్ని పోలినవి. తూర్పు యూరపులోను, ఆగ్నేయ యూరపులోను వున్న ఎనిమిది దేశాలలో (సోవియట్ యూనియన్ కాక) పైన పేర్కొన్న మూడు ఆర్థిక విధానాలలో మొదటిది ఈ నాడు ఆచరణలో వుంది; మధ్య యూరపు. పశ్చిమ యూరపులోని అనేక దేశాలలో రెండవది ఆచరణలో వుంది; మూడవది ఫాసిస్టు రాజ్యాలలో, లేదా కొంతవరకు ఫాసిస్టు నిరంకుశత్వంలో వున్న రాజ్యాలలో ఆచరించబడుతూంది.

యూరపియన్ పద్ధతి

యూరపులో 30 కి పైగా దేశాల విధానాలలో తగినన్ని తేడాలు వున్నప్పటికీ, పైన వివరించినది ఈనాడు యూరపులో ముఖ్యంగా కనిపించే ధోరణుల సారాంశం. కమ్యూనిస్టులు కంట్రోలు చేస్తున్న అర్ధభాగం యూరపులోఆస్తిపై వ్యక్తులకుహక్కు పోయింది; ఆర్థిక విధానంలో అది విశిష్ట లక్షణంగా వుండకుండా అంతరించింది. మిగతా యూరపులోని అధికభాగంలో ఆస్తిపరులకు నిర్ణయాల బాధ్యత వుండకుండా చాలా తగ్గించి వేశారు. ఆ బాధ్యతలను ప్రభుత్వాలు స్వీకరించాయి. ప్రతిచోటా స్వేచ్ఛావ్యాపారం అంతరిస్తున్నట్టు కనిపిస్తూంది.

అమెరికన్ పద్ధతి

ఉత్తర అమెరికా ఖండం దేశాలైన అమెరికా, కెనడాలలో వున్న పద్ధతి వేరు; కాపిటలిజం ప్రత్యేక సౌకర్యంగా వుండడం వీటిలో అంతకంతకు తగ్గిపోయి, కాపిటలిజం ఇచ్చే ప్రయోజనాలలో భాగం పొందుతున్న వారి సంఖ్య హెచ్చింది. శ్రామికవర్గం పెరిగిపోకుండా అరికట్టారు; శ్రామికవర్గం సన్నగిలి పోతున్నది; ప్రతి సంవత్సరం యూరప్, మెక్సికో, పోర్టోరీకోలనుంచి వేలకొలది వలసదారులు వచ్చి కార్మికుల స్థానాన్ని భర్తీ చేస్తున్నప్పటికీ ఈ విధంగానే జరుగుతూంది. అమెరికా, కెనడాలలో అనేక దారుణ ఉపద్రవాలు సంభవించాయి; ఆర్థిక వ్యవస్థ వీటిలో స్థిరంగా లేదనీ, ఒడుదుడుకులలో

వున్నదనీ చాలామంది తలపోసిన పరిస్థితులు ఏర్పడ్డాయి; అయినప్పటికీ, యూరపులో కాపిటలిజం ఫలితంగా వచ్చిన బాధలు ఈ రెండు దేశాలకు రాలేదు. కాపిటలిజాన్ని సంస్కరించుకోవాలని ఇవి వాంఛించాయి. ఇప్పటికీ అదేవిధంగా వాంఛిస్తున్నాయే గాని దానిని నాశనం చెయ్యాలనుకొనడం లేదు.

**విభిన్న మార్గాలు**

మనకూ, అమెరికనులకూ చాలా తేడా వుందని యూరపియనులమైన మనకు సాధారణంగా తోచదు. లేదా, అమెరికన్ వ్యవస్థలు మనవాటికి పూర్తిగా భిన్నమైనవని కూడా మనకు సామాన్యంగా అనిపించదు. అయితే, అమెరికా అనుసరించిన మార్గం, యూరపు దేశాలు అనుసరించిన మార్గం కొంతకాలం ఇంచుమించు ఒకలాంటివే ననడం నిజం. కాని, 20 వ శతాబ్ది మధ్యభాగంలో వున్న మనం ఒక విషయాన్ని గుర్తించాలి. రాజకీయంగా, ఆర్థికంగా, బౌద్ధికంగా అమెరికాకు (దానిలాగే కొంతవరకు కెనడాకు) పశ్చిమ యూరప్ దేశాలకూ పూర్తి తేడా వున్నదనీ, ఈ తేడా హెచ్చుతున్నదనీ మనం గుర్తించవలసివున్న విషయం. యూరపియనులు సాధారణంగా తమ అనుభవాలను ఆధారంగా తీసుకొని అమెరికా ఆర్థికవిధానం విలువను నిర్ణయిస్తూంటారు. అందువల్ల వారికది పాతకాలపు విధానంగా కనిపించవచ్చు. (కాబట్టి వారు తరచు యిలా అంటూ వుంటారు: బ్రిటిష్, జర్మన్, ఫ్రెంచి కాపిటలిజం ఒకటి రెండు తరాల క్రిందట ఎలా వుండేదో ఇప్పటి అమెరికన్ కాపిటలిజం ఆ విధంగా వుంది). వారన గలిగిందల్లా అంతే.

**కొన్ని విభేదాలు**

నిజానికి, కాలవ్యత్యాసమే కాదు; ఇంకా పెద్ద తేడాయే వుంది. ఉదాహరణకు, అమెరికన్, యూరపియన్ ఆర్థిక విధానాలు 1886 లో ఒక్కలాంటివే. ఈనాడు యూరపులోవున్న కాపిటలిజం 70 సంవత్సరాలకు పూర్వం వున్నదానికంటె చాలా భిన్నమైనది. అలాగే అమెరికన్ కాపిటలిజం కూడా. అంతే కాదు; ఉభయ ఆర్థిక విధానాలు ఎంత విభిన్నమార్గాలను అనుసరించాయంటే, ఈనాడు రెండింటికీ ఎక్కడాపోలిక లేదు. అమెరికాలో ఆర్థిక అంగాల విలీనీకరణ పద్ధతి బ్రిటిష్, జర్మన్, ఫ్రెంచి పద్ధతులకు భిన్నమైనది; తమ కాపిటలిజాన్నిగురించి అమెరికన్ ఆర్థిక శాస్త్రవేత్తలు ఇరవై

సంవత్సరాలక్రితమే ఏమని భావించారంటే : "అది ఇకమీద ఒకరితో వొకరు పోటీపడే వ్యాపారాలున్నదీ కాదు; అలాగని చెప్పి, అది గుత్తవ్యాపారులున్నదీ కాదు." పనివారు పరిశ్రమలో ఒక భాగంగా వుండేవారే గాని దానికి శత్రువులు కారు; వ్యాపారసంస్థల వైఖరులను, పద్ధతులను లేబర్ యూనియనులు అనుసరించాయి; అమెరికాలో సోషలిస్టు ఉద్యమం లక్ష్యపెట్టవలసినంతగా లేదు; అది బలపడడానికి బదులు పట్టు తప్పిపోయింది; (సమష్టివాదం మనగలిగినప్పుడు ఏర్పడేది కమ్యూనిజం; సమష్టివాద వ్యతిరేక శక్తులు బలపడినప్పుడు ఏర్పడేది ఫాసిజం.) నియంతృత్వ ధోరణులకు ముఖ్యంగా దారితీయగల సమష్టివాదపూరిత వాంఛలు అమెరికా ప్రజలలోను, అలాగే కెనడా ప్రజలలోను లేవు.

మనసారా ఇష్టంలేని ఆర్థిక స్వేచ్ఛ

ఆర్థిక స్వాతంత్ర్యం ఏ విధంగా వుండాలో యూరప్, అమెరికాలు చేసిన భావనలనుబట్టి వాటి కాపిటలిజములలో వ్యత్యాసం వచ్చింది. ఆర్థిక కార్యకలాపాలకు నిర్బంధంగావున్న శాసనాలను, చట్టాలను, నియమాలను, ఇంకా అటువంటి వాటినీ రద్దు చేయించాలని 18 వ, 19 వ శతాబ్దాలనాటి యూరపియన్ ఉదారవాదులు ప్రయత్నించారు. పూర్వపు ఆర్థిక శాస్త్ర విషయాలకు ఒక రూపు కల్పించిన బ్రిటిష్, ఫ్రెంచి రచయితలు ఈ ప్రయత్నాలు సహేతుకమైనవని వ్రాశారు. వారు కొన్ని ప్రకృతి సిద్ధమైన ఆర్థిక సూత్రాలను నొక్కి వక్కాణించి, వాటిని అనుసరించడం అవసరమని పేర్కొన్నారు. శాసనం లేకపోతే ఆర్థిక స్వాతంత్ర్యం వున్నట్టేనని యూరప్‌లో భావించారు. ఆర్థిక వ్యవహారాలలో ప్రభుత్వ శాసనం, లేదా జోక్యం వుంటే కాపిటలిజం నాశనమైనట్టేనని 20 వ శతాబ్దపు సమష్టివాదులు, వర్గ ఆర్థిక విధానవాదులు భావించారు. కాపిటలిస్టులు, ఇతర ఆస్తిపరులు ఆర్థిక వ్యవహారాలను గురించి శాసనాలు వుండాలనే నిర్ణయానికి వచ్చినప్పుడు, తాము కంట్రోలు చెయ్యగలిగిన ఆర్థిక వ్యవస్థకు అవి దారి తీస్తాయనీ, అయితే అది ఆ మీదట స్వేచ్ఛా విధానం కాబోదనీ ఊహించారు. కాపిటలిజాన్ని బలపరచిన వారికిగాని, ప్రతిఘటించినవారికిగాని, శాసనాన్ని స్వేచ్ఛకోసమూ చేసుకోవచ్చు, నియంతృత్వ స్థాపనకూ చేసుకోవచ్చునని తోచలేదు; రాజకీయ రంగంలోలాగే ఆర్థిక రంగంలోకూడా శాసనాలు లేనంత మాత్రంచేత స్వేచ్ఛ వచ్చినట్టు

కాదని వారికి తోచ లేదు; శాసనాలను చెయ్యడంవల్లనే స్వేచ్ఛను స్థాపించి బలపరచి, స్థిరపరచ వచ్చునని వారికి తోచ లేదు. అంతకంటె ముఖ్యమైన దేమంటే, సహజంగావున్న లోపాలను సరిదిద్దుకోడానికి చట్టాలు చేసు కొనడం అవసరమని వారికి తోచలేదు.

ఆర్థిక స్వేచ్ఛ గురించి అమెరికన్ సిద్ధాంత మనసారా ఇష్టంవున్న
మేమిటో పుస్తకాలద్వారా కంటె అనుభవం ద్వారా ఆర్థిక స్వేచ్ఛ
బాగా గ్రహించ వచ్చును. ఈ విషయమై ఒకరి
మాటలు వ్రాతలు కంటె అమెరికా చేసిన పనినిబట్టి బాగా అర్థమౌతుంది. అమెరికన్ సిద్ధాంతం చాలా సులభమైంది: "రాజకీయ స్వేచ్ఛకూ ఆర్థిక స్వేచ్ఛకూ తేడా ఏమీలేదు. ఆర్థికస్వేచ్ఛను నెలకొల్పి, దానిని నిలబెట్టి బలపరచాలనే ఆశయంతో శాసనాలు చేసినప్పుడు కలిగే ఫలితమే అది." యూరపియన్ ఆర్థిక స్వేచ్ఛ, ఇష్టం వుండి ఏర్పాటు చేసుకున్నది కాదు; అమెరికన్ ఆర్థిక స్వేచ్ఛ, ఇష్టంతో ఏర్పరచుకొన్నది. ఈ రెండింటికీ వున్న వ్యత్యాసం, వాస్తవ పరిస్థితులలో ఎవరెవరు ఏ విధంగా వ్యవహరించారో పరిశీలించినప్పుడే స్పష్టంగా బోధపడుతుంది. మానవుడు సృష్టించిన ప్రతి యితర విషయంలాగే, కాపిటలిజానికి కూడా చాలా పరిమితులూ వున్నాయి; దానిలో పొరపాట్లూ వున్నాయి. కాపిటలిజం కారణంగా కష్టాలు కలిగినప్పుడు యూరపియన్‌లకు దిక్కు తోచలేదు; అవే కష్టాలు సంభవించినప్పుడు అమెరికనులు తగిన శాసనాలు చేసుకోడానికి ఇష్టపడు తూండేవారు. పేదలకు విషమసమస్య పేదరికం; అలాగే నిరుద్యోగులకు నిరుద్యోగం, దివాళా కోరులకు విషమ ఆర్థిక పరిస్థితులూ తీవ్ర సమస్యలు. ఇవి ప్రకృతి సిద్ధమైన విషయాలేననీ, వీటి విషయంలో జోక్యం కలిగించుకో రాదనీ యూరపియన్ ఉదారవాదులు నమ్మారు. వారు ఈ సమస్యలను తమ ప్రత్యర్థులకు విడిచిపెట్టారు; మొదట సోషలిస్టులకు, ఆ తరువాత ఈ సమ స్యను పరిష్కరించాలంటే మధ్య యుగాల వారిలాగ ప్రవర్తించాలనే వారికీ విడిచి పెట్టారు. 19 వ శతాబ్దం మధ్య ప్రాంతంవరకు సంస్కరణలు తీసుకు వచ్చేవారి పార్టీగా వున్న ఉదారవాదులపార్టీ నిర్వీర్యుల పార్టీగా అయింది. అమెరికనులు తమ సూత్రప్రాయ విశ్వాసాలు ఎలా వున్నప్పటికీ, ఆర్థిక స్వేచ్ఛను అట్టిపెట్టుకొంటూనే, దారిద్ర్యాన్ని, నిరుద్యోగాన్ని, విషమ పరిస్థితు లనూ బాపుకోవచ్చుననే ధోరణిలో ప్రవర్తించారు.

అ రా చ క ం,
శాసనబద్ధ రాజ్యాంగం

కాపిటలిజం వ్యాపించడానికి కారకులైన యూరపియన్ ఉదారవాదులు శాసనరీత్యా స్వేచ్ఛ వుండాలనే సూత్రానికై రాజకీయ సమరాలు జరిపారుగాని, ఆ సూత్రాన్ని ఆర్థిక రంగంలో ప్రవేశ పెట్టలేకపోయారని మనం ఆశ్చర్య పడితే తప్పు లేదు. దేశంలో నిరంకుశత్వం లేకపోతే దాని స్థానే వుండేది అరాచకమేనని వారెన్నడూ రాజకీయాలలో వాదించ లేదు : ఇంతకు ముందూ, ఇప్పుడూ కూడా వారి లక్ష్యం రాజ్యాంగ చట్టబద్ధమైన పార్లమెంటరీ ప్రభుత్వం; రాజకీయ స్వేచ్ఛ అంటే శాసనాలు లేకుండా వుండడంకాదు ; పైగా శాసనాలు చేసుకోడానికి మార్గాన్ని సుగమంచేసేదే రాజకీయ స్వేచ్ఛ. శాసనాలు లేని యూరపియన్ కాపిటలిజం ఆర్థిక రంగంలో అరాచకమైంది. అందువల్ల బలవంతులలో, విజయవంతులలో నిరంకుశులు కావడానికి అది దారి చేసింది. దుర్బలులలో, అపజయులలో బానిసలు కావడానికి అది కారణమైంది. అమెరికనులు ఆర్థిక స్వేచ్ఛకోసం శాసనాలు చేసుకున్నారు. అరాచకానికీ, రాజ్యాంగ బద్ధ వ్యవస్థకూ వున్న తేడాయే యూరపియన్, అమెరికన్ కాపిటలిజాలకు వున్న తేడా.

మంకుపట్టుతో
ప్రయత్నం

యూరపియన్ ఉదారవాదులు ఆర్థిక సమస్యలను చివరికైనా పరిష్కరించకుండా చేసి, వారికి పలుకుబడి వున్నప్పుడే కాపిటలిజం నిలబడడానికి ఉపకరించే సంస్కరణలు ప్రవేశపెట్టలేకుండా అడ్డుపడ్డవారు పారిశ్రామికులూ, ధనవంతులూ నని కొందరు విమర్శించారు. దూరదృష్టిలేని రాజకీయ నాయకులను ఈ విధంగా విమర్శిస్తే అది నిజం కావచ్చు; కాని, ఉదారవాదులైన రాజనీతిజ్ఞులనూ, జ్ఞానులనూ ఇలాగ విమర్శించడం ముమ్మాటికీ పొరపాటు. ఎందుకంటే, వారు ధనవంతుల వొత్తిడిలో వున్న వారు కారు ; ఉదారవాదం ఆత్మహత్యకు పాల్పడడం వారి అభిమతం కాదు. వారు ఎందుకు అపజయం పొందారంటే, పరిస్థితులనుబట్టి మార్పుచేసుకొంటూ.వుండవలసిన ఒకసూత్రాన్ని వారు మూఢాచారంగా చేసుకున్నారు. ఈ శతాబ్దారంభంలో ఉదారవాదులు తల్చుకుంటే యూరప్ ఆర్థిక పరిణామాలను నూతన మార్గంలోకి మళ్ళించగలిగే వారు. ఆడమ్ రచించిన "అమెరికా ఆర్థిక ఘనత" (అమెరికాస్ ఎకనామిక్ సూప్రమసీ) కు ఉపోద్ఘాతం వ్రాస్తూ చైల్డ్స్ చెప్పినట్లు "యూరప్ ఒక పరిస్థితిని

బట్టి మరొక పరిస్థితికి జారుతూ వచ్చింది." ఏమైనా, ఇవన్నీ ఉదారవాదానికి వ్యతిరేకమైనవి. ఆర్థిక వ్యవహారాలలో ఉదారవాదాన్ని ప్రవేశపెట్టిన ఆర్థిక వేత్తలు (చాలామంది కంటె ఎక్కువ వివేచనవున్న ఆడమ్ స్మిత్ మాత్రం కాదు లెండి) మూఢాచారంలో పడిపోవడం విధివైపరీత్యం.

యూరపియన్, అమెరికన్ విధానాలలో తేడా 18 వ శతాబ్దం చివరి రోజులనుంచీ వుంది. ప్రయివేటు ఆర్థిక స్వేచ్ఛ, స్వేచ్ఛా ప్రయత్నం, జెఫర్సన్‌నుంచి ఐసెన్‌హోవరు వరకు వ్యక్తిగతమైన సాహసం, స్వేచ్ఛా వ్యాపారం వీటిపట్ల జఫర్సన్ నిస్సందేహంగా నమ్మకమున్న వాడు; ఆ కాలంనాటి ప్రముఖ బ్రిటిష్, ఫ్రెంచి ఆర్థిక శాస్త్రవేత్తలంత భావనాపటిమ కలవాడని చెప్పవచ్చు. వారి రచనలలోని విషయాలు జఫర్సన్‌కు తెలుసు. కాని, ఆయన మాత్రం మూఢ నమ్మకాలు కలవాడు కాదు. అవి వున్నవాడైతే ఇలాగ వ్రాసేవాడు కాదు: "ఆస్తి పాస్తులను అందరికీ సమానంగా పంచడం అసాధ్యమని నాకు గ్రహింపు వుంది. కాని, ఆస్తులలో తేడాపాడాలు మరీ హెచ్చుగా వుంటే, వాటిని పదే పదే విభజన చేస్తూండడానికి శాసనకర్తలు అంతులేకుండా పద్ధతులు కనిపెట్టలేరు." స్వేచ్ఛా ప్రయత్నం, వ్యక్తిగతమైన చొరవ ఆర్థికాభివృద్ధికి కీలకాలై వుండేటందుకు హామిల్టన్ ఒక సెంట్రల్ బ్యాంకిని స్థాపించడానికి శాసనాన్ని చేయించాడు; వ్యాపారాన్ని కాపాడే సుంకాలు వుండాలని వాదించాడు; ఆర్థిక వ్యవస్థలో వున్న పలువిభాగాలు ఒక దానికొకటి హాని కూర్చకుండా చెయ్యడానికి ప్రభుత్వ జోక్యం అవసరమని ఆయన నొక్కి వక్కాణించాడు. 1945 జనవరిలో ప్రెసిడెంటు రూజ్వెల్టు ఇలా అన్నాడు: "మంచి అవకాశాలకు ఆటంకం లేకుండా చేసే బాధ్యత, వ్యాపార సరళి స్థిరంగా సాగేటట్టు చేసే బాధ్యత ప్రభుత్వం మీద వుంది." కాని, 1944 ఆకురాలు కాలంలో ప్రెసిడెంటు పదవికి పోటీ చేసిన రిపబ్లికన్ అభ్యర్థి ఇలా అన్నాడు: "ఉద్యోగావకాశాలను ప్రభుత్వం కలిగించగలదు; కలిగించి తీరాలి." అమెరికా ఆర్థిక స్థితిగతులను గురించి ప్రెసిడెంటు ఐసెన్‌హోవరు 1954 జనవరిలో కాంగ్రెసుకు ఒక నివేదిక పంపించాడు. తనతో ఏకీభవించిన వారియొక్క, తన సలహాదార్ల యొక్క (వీరిలో చాలామంది పలుకుబడిగల వ్యాపారస్తులు) అభిప్రాయాలను ఆయన తెలియ

బరచాడు. ఆ నివేదికలో ఐసెన్‌హోవరు తెల్పిన విషయమిది: "వ్యక్తిగత ప్రయత్నాలు ఆర్థికాభివృద్ధికి తోడ్పడగల విధంగా నిర్మాణాత్మక కృషి జరిగే వాతావరణాన్ని సృష్టించడం, పౌరుపరితనాన్ని ప్రోత్సహించడం, మిగతా ప్రపంచంతో ఆర్థిక అనుబంధాలను బలీయంచెయ్యడం ఇవన్నీ కూడా స్వేచ్ఛా సమాజంలో ప్రభుత్వంమీద వున్న బాధ్యతలు....ప్రభుత్వం తను నిర్వహించవలసి వున్న అనంత బాధ్యతలతో సహా ఆర్థిక పరిణామాలను కూడా శ్రద్ధగా గమనిస్తూ వుండాలి. అనర్థాలను రానివ్వరాదు; వచ్చినప్పుడు నివారించాలి; వీటికి ప్రభుత్వం సిద్ధంగా వుండాలి. నూతన పరిస్థితులు ఏర్పడే యెడల వాటికి తగినట్లు వ్యవహరించడానికి ప్రభుత్వం సమాయత్తమై వుండాలి....ఆర్థిక సుస్థిరతను కాపాడడానికి ప్రభుత్వం వద్ద వున్న ఆయుధాగారం అజేయమైంది. ఈ ఆయుధాగారంలో వున్నవి ఇవి: ఫెడరల్ రిజర్వు శాఖ పరిపాలనలో వున్న క్రెడిట్ కంట్రోలులు; ట్రెజరీ చేతిలో వున్న అప్పుల మేనేజిమెంటు విధానాలు; ఫెడరల్ ఇన్సూరెన్సు తాలూకు తణఖాల షరతులను మార్చడానికి ప్రెసిడెంటుకు వున్న అధికారాలు; బడ్జెట్‌ను ఎలాగ కావాలంటే అలాగ వినియోగపరచుకోడానికి వున్న సౌలభ్యం; వ్యవసాయదారులకు మద్దతులు; పన్నుల విధానం మార్పు; పబ్లిక్ వర్కులు." జఫర్సన్, ఐసెన్‌హోవరు ఇరువురూ కూడా ఆర్థిక స్వేచ్ఛయెడల పరమ విశ్వాసం కలవారు. వారికీ, జేమ్స్‌మిల్, జే. బి. సాయ్‌లకూ ఎంతో తేడా వుంది. మిల్, సాయ్‌లు, వారి అసంఖ్యాక శిష్యులూ కలిసి యూరపియన్ ఉదారవాదులలో అయిదు తరాల వారికి "ఆర్థిక సమస్యల విషయంలో తెలివితేటలుగా వ్యవహరించడానికి ఏకైక మార్గం వాటి జోలికి వెళ్ళక పోవడమే," అని నమ్మకం కలిగించారు. బహుశా, 20 వ శతాబ్దంలో యూరపియన్ ఉదారవాదం బలహీనం కావడానికి వారి వాదమే ముఖ్య కారణం.

**సాంఘిక సంస్కరణలకు ఆందోళన**

యూరప్‌లోనూ, అమెరికాలోనూ వున్న సాంఘిక సమస్యలు ఇదివర కేమి, ఈనాడేమి పెద్ద తేడా వున్నవి కావు. అమెరికాలోను, యూరపులోను కూడా స్వేచ్ఛావాదం ఫలితంగా ఒక మార్పు వచ్చింది. అది ప్రజలలో అడుగున పడివున్నవారంటూ భావించిన తరగతుల వారిలో రాజకీయ పరిజ్ఞానం

కలగడం. స్వభావం చేతగాని, తమ వృత్తి చేతగాని జీతగాళ్ళు మిగతా తరగతులవారికంటె హెచ్చు విప్లవకారులు కాదు; తమ స్థితిగతులనుగురించి యోచించుకొన నారంభించినప్పుడు వారికి కలిగే కోరికలు ఇవి : తమకు ఆర్థిక భద్రత కనీసంగానైనా వుండాలి ; తగినంతగా సక్రమమైన పనులుండాలి ; పనిగంటలు పరిమితంగా వుండాలి ; మంచి జీతాలు వుండాలి ; వ్యాధులు వచ్చినా, ప్రమాదాలు వచ్చినా కూడా తమ ఆదాయానికి లోపం రానివ్వని హామీ ఏదో ఒకటి వుండాలి; వృద్ధాప్యపు పెన్షన్లు వుండాలి. యూరప్ ఉదార వాదులలో కొలదిమంది వివేకవంతులు (బ్రిటిష్ రిఫారమ్ లిబరలులు, యూరప్ రాడికలులు) ఈ శతాబ్దారంభంలో "స్వేచ్ఛా ఆర్థిక విధానానికి సాంఘిక సంస్కరణలు అనుగుణమైనవే" అనే నిర్ణయానికి వచ్చి, తన ఆస్తిని ఏ విధంగా ఉపయోగించవలెనో నిర్ణయించేటప్పుడు యజమానికి హెచ్చు బాధ్యత వుండాలనే భావానికి వచ్చేసరికి కాలం మించిపోయింది. అప్పటికే సోషలిజం ప్రచారమైంది; దానిని బలపరచిన వారికి, ప్రతిఘటించిన వారికి కూడా ఎటువంటి రాజకీయ పక్షాభిమానా లున్నప్పటికీ, ఆర్థిక స్వేచ్ఛ ఎంతవరకు అరికట్ట బడిందో అంత మేరకు సాంఘిక సంస్కరణలలో ముందుకు వెడుతూవుండాలని వారికి నమ్మకం కలిగింది; కొంతవరకైనా సామ్యవాదపూరిత వ్యవస్థ అయిన దానిలోగాని ఆర్థిక భద్రత వుండదని వారనుకున్నారు; ఈ విషయాలను అధిక సంఖ్యాక ప్రజలు విశ్వసించారు. ఆనాటి కాపిటలిజానికి అను కూలంగా వుండడమంటే సాంఘిక సంస్కరణలకు, ఆర్థిక సుస్థిరతకు వ్యతిరే కంగా వుండడమన్నమాట; వీటిలో ఏదో ఒక దానికిగాని, రెండింటికిగాని అనుకూలంగా వుండడమంటే కాపిటలిజం కాని ఆర్థిక వ్యవస్థను కోరడమన్న మాట. ఇదంతా ఆనాటి కార్మికుల, యజమానుల, ఆర్థిక శాస్త్రవేత్తల నమ్మకం. సంపూర్ణంగా విషమ ఫలితాలు కూర్చిన పొరపాటు ఇది.

సమష్టివాదానికి అమెరికన్ ప్రజలు అనుకూ సోషలిజంలోని లురు కానట్లే, యూరపియన్ ప్రజలుకూడా కారు. ఆకర్షణ ప్రజానీకానికి నాయకత్వం వహించిన విజ్ఞానులు కాపిటలిజం స్థానే మరొక విధానం ఏర్పడాలని ప్రజలను నమ్మించారు. ప్రజల లక్ష్యం కష్టమైనదేమీ కాదు; పరిమితమైనది. దానిని సాధించడానికి ప్రజలలో అధిక సంఖ్యాకులు బహుళ స్వరూపాలలో వున్న సోషలిజాన్ని పట్టుకున్నారు; మార్క్సు వాదం, కూటవాదం, ఫేబియన్ వాదం, క్రిస్టియన్ వాదం, జాతీయ వాదం మొదలైనవి ఇవి. ఇవన్నీ పేర్లు మాత్రం తేడాగా వున్నవైనా పటి

లక్ష్యం ఒకటే : స్వేచ్ఛావ్యాపారం లేకుండాచేసి, ఆస్తిమీద ప్రయివేటు వ్యక్తుల హక్కును రద్దుచెయ్యడం, లేదా, పరిమితం చెయ్యడం.

సాంఘిక సంస్కరణలు ఆర్థిక స్వేచ్ఛకు అనుగుణమైనవి

సోషలిస్టులుగాని, ముమ్ముందు సోషలిస్టులు కాబోయే వారుగాని బలపడకుండా సాంఘిక సంస్కరణలను చేయడం ఆర్థిక స్వేచ్ఛకు అనుగుణమైనదే నని విశ్వాసం గలవారు అమెరికాలోనూ, కెనడాలోనూ కూడా తగినంతమంది ప్రజలు ఎల్లప్పుడూ వున్నారు. ఆర్థిక స్వేచ్ఛా విధానం సమష్టి విధానంకంటే, వర్గవిధానంకంటే కూడా ఉత్తమమైనదని నమ్మకం కలవారు, సాంఘిక సంస్కరణలు కోరుతున్న ఉద్యమానికి అనేక సందర్భాలలో నాయకత్వం వహించారు. లాయిడ్ జార్జ్ ప్రయత్నాలు చేసినప్పటికీ కూడా బ్రిటిష్ ఉదారవాదం దారుణంగా విఫలమైంది; అయితే కెనడా ఉదారవాదం విజయవంతమైంది. జర్మనీ ఇటలీలలో ఉదారవాదం విఫలంకాగా, అమెరికన్ రిపబ్లికనులు, డెమోక్రాట్‌లు విజయం పొందారు. (ఫ్రాన్సుకు తూర్పునవున్న దేశాలలోని రాడికల్‌వాద వ్యతిరేకుల కంటె ఫ్రెంచి రాడికల్ పార్టీవారు అదృష్టవశాత్తు ఎక్కువ విజయం పొందారు). బానిస ఆర్థిక విధానంలోకంటె స్వేచ్ఛా ఆర్థికవిధానంలో ఒడుదుడుకులు వచ్చినప్పుడల్లా ప్రజలు ఎక్కువగా బాధ పడడం జరుగుతుంది. ఆ విధంగా జరిగినప్పుడు ప్రజల బాధలను తగ్గించడానికి అమెరికా, కెనడాలలో చట్టాలు చేయబడ్డాయి; కార్మికులకు క్షేమం కలగడానికి, లేదా తాము కొంతవరకైనా క్షేమంగావున్నట్లు వారు ధైర్యంగా వుండడానికి తగినన్ని సాంఘిక సంస్కరణలు చేయబడ్డాయి. యూరపియన్ కాపిటలిజం చేయలేకపోయిన పనిని అమెరికా, కెనడాల కాపిటలిజం చేసింది. యూరప్‌లో కాపిటలిజం విఫలమైనందున, దానిలో సోషలిజం ప్రభావం తిరుగులేనిదైంది; అట్లాంటిక్ సముద్రం మొదలుకొని యూరల్ పర్వతాలవరకు గల దేశాలలో సోషలిజం తన నిజ స్వరూపంలోనో, లేక ఉదారవాద ఆశయాల ప్రభావం చేతగాని, జాతీయవాద ప్రభావం చేతగాని పరిణతి పొందిన స్వరూపంలోనో ఈనాడు బహుశా ఏకైక అమోఘశక్తిగా తయారైంది. యూరప్‌లో ఉదారవాదం మొదట దుర్బలమై, తరువాత విధిలేక జాడలేకుండా పోయింది. అమెరికా, కెనడాలలో సోషలిజం లేదు; (శక్తిమంతమైన ఆర్థికేతర శక్తులవల్ల తీవ్ర ప్రమాదానికిగురి అయినప్పటికీ) ఉదారవాదం ఇప్పటికీ వాటిలో వ్యాప్తి చెందే అవకాశం వుంది. పాశ్చాత్య నాగరికతలోని రెండు ప్రధాన భాగాల ప్రజలలో ఈనాడు వున్న అతి పెద్ద తేడా బహుశా పైన తెల్పిన విషయమే

# III అమెరికా పద్ధతి

సంగ్రహం—సహజ సంపదలు మాత్రమే చాలవు—ఆంతరంగిక వ్యవస్థ—ఒంటరితనం కారణం కాదు—జాతి విభేదం హేతువు కాదు—ఈ విధానం వహించిన పాత్ర—చట్టబద్ధమైన కాపిటలిజం—ప్రజాస్వామికమైన కాపిటలిజం—మూడు ప్రధానలక్షణాలు—ఆస్తి వినియోగంలో స్వేచ్ఛ—పోటీపద్ధతి; దానికి ఆటంకాలు—ప్రభుత్వంయొక్క అభిప్రాయం—ప్రజల తోడ్పాటు—మితిమీరిన ఆశకాదు—ఆస్తి అవసరం—ఆస్తిపై హక్కు—అందరికీ కాపిటలిజం—తెలిసి అనుసరించే పద్ధతి—శ్రమకు వున్న గౌరవం—కార్మికులు, పెట్టుబడిదారులు చాలావరకు ఒకరే—మేనేజర్ల వర్గం—ప్రజలకంటె ధనికులు ముఖ్యులా? — ధనికుల కంటె ప్రజలు ముఖ్యమా?—విక్రేతల శక్తి కీలకాంశం — విక్రేతపైన కార్మికులు—హెచ్చుజీతాల విధానం—పైకి కనిపించని పోటీ—పోటీ పనిచేస్తున్న స్థాయి—వ్యాపారంలో మార్పులు—ఆర్థిక విధానాన్ని ఉన్నతస్థాయిలో వుంచేది పోటీ—భారీతనాన్ని అరికట్టేది పోటీ—విభిన్న పద్ధతిలో ప్లానింగు—వ్యాపారంలో ప్లానింగువహించే పాత్ర—ఉదార, వృత్తి విద్యలమీద శ్రద్ధ—సైన్సుపట్ల శ్రద్ధ—ఆర్థిక స్వేచ్ఛకు, తదితర స్వేచ్ఛకు మధ్య సంబంధం స్పష్టంగా ఎప్పుడూ లేదు — అమెరికాలో అది స్పష్టతరం — విద్యాబోధ పాత్ర — వ్యాపారస్తులు పరిష్కరించుకోలేని సమస్యలు—కార్మిక సంఘాల ప్రాముఖ్యం—అమెరికన్ కార్మికులు సోషలిస్టులు కారు—రెండు పెద్ద కార్మిక సంఘాలు—అనుభవంవల్ల గ్రహింపు—అమెరికన్ కార్మికోద్యమంలో లోపం—ప్రభుత్వ పాత్ర; సూత్రాలు—వ్యాపార రక్షణనుంచి గుత్త నర్తకంమీద దాడివరకు మార్పు—ప్రభుత్వ జోక్యం. సమస్థితికోసం—ఆర్థిక రంగంలో ప్రభుత్వం ఒక ముఖ్యభాగం.

"అమెరికాలో జనాభా తక్కువ; వారి సంఖ్య సహజ సంపదలుతో పోల్చిచూస్తే అక్కడ సహజ సంపదలు కొల్లలు. మాత్రమే చాలవు అమెరికా ఆర్థిక విధానం మిగతా దేశాలలో కంటె ఉత్తమంగా వున్నదీ అంటే అందుకు ఆ సహజసంపదలు పూర్తిగా

కాకపోయినా ముఖ్యంగానైనా కారణం”—ఇది విదేశీయులలోనేగాక అమెరికాలోకూడా సామాన్యంగా వున్న అభిప్రాయం. అమెరికా మిడిల్ వెస్ట్ ప్రాంతంలోని పంటభూములు, పశ్చిమోత్తర ప్రాంతంలోని అడవులు, ఇనుప గనులు, బొగ్గు గనులు, పెట్రోలు గనులు మొదలైన సహజ సంపదలు కొల్లలుగా వున్న దేశమది. దేశ వైశాల్యం, జనాభా, నేల సారం, గనులు మొదలైన అంశాలే ముఖ్యమన్నట్టయితే అమెరికా కంటె రష్యా ఉన్నత ఆర్థిక స్థాయిలో వుండవలసిన దేశం; ఎందుకంటే, అమెరికా కంటె రష్యా సుమారు మూడు రెట్లు పెద్దది; అమెరికాలోకంటె జనాభా తక్కువ; పైకి తెలిసిన సహజ సంపదలు అమెరికాలోకంటే ఎక్కువ. ఫ్రెంచి యూనియనులోను, బ్రిటిష్ సామ్రాజ్యంలోను కూడా ఆర్థిక స్థాయి అమెరికాలోకంటె హెచ్చుగా వుండాలి. (16 కోట్ల 50 లక్షలమంది అమెరికనులు నివసిస్తున్న దేశం కంటె బ్రిటిష్ సామ్రాజ్య విస్తీర్ణం పెద్దది; అంత పెద్ద భాగంలో వున్న బ్రిటిష్‌వారు పదికోట్ల మంది. ఫ్రెంచి యూనియన్ సుమారు బ్రిటిష్ సామ్రాజ్యమంతా వుంది); జనాభా లెక్కను చూస్తే, వీటిలో పైకి తెలిసి వున్న సహజ సంపదలు అమెరికాలో వున్న వాటికంటె తక్కువ అనేది నిజం; అయితే, అవి జీవన ప్రమాణాలలో అమెరికాకు, ఈ తక్కినదేశాలకు ఈనాడు వున్నంత పెద్దతేడా వుండవలసినంత తక్కువకావు.

**ఆంతరంగిక వ్యవస్థ**

పారిశ్రామిక రంగంలోకి అందరికంటె ఆలస్యంగా ప్రవేశించిన దేశం రష్యా అని కొందరు వాదిస్తారు; ఫ్రెంచి యూనియన్, బ్రిటిష్ సామ్రాజ్యాలలో పాలకులు వేరు, పాలితులు వేరు అనీ, అమెరికాలో అలాగ కాదనీ వారంటారు. అంటే, ఆర్థిక విధాన ఫలితాలు చాలావరకు కనీసం ఆ యా విధానాలనుబట్టి-వేర్వేరు యూనియనులు, సామ్రాజ్యాలు నిర్మాణమైన మార్గంబట్టి—కలుగుతాయన్న మాట. దాని అర్థమేమంటే, సహజ సంపదలసంగతి ఎలా వున్నప్పటికీ యంత్రాన్ని వినియోగపరచడంలో మానవుని సామర్థ్యాన్నిబట్టి తేడా వుంటుందన్నమాట; సహజసంపదల సంగతి ఎలా వున్నప్పటికీ, అమెరికాలాగ ఒకే మార్కెట్టుగా వున్న యూనియన్‌వల్ల కలిగే ఫలితాలు, వేర్వేరు మార్కెట్టులతో కూడిన యూనియన్‌లవల్ల, సామ్రాజ్యాలవల్ల కలగవన్నమాట.

**ఒంటరితనం కారణం కాదు**

అమెరికా ఆర్థికాధిక్యతకు కారణం అది ఎంతో కాలంనుంచీ రాజకీయంగా ఒంటరిగా వుండడమని చాలామంది వాదిస్తారు. ఒంటరితనమే కీలక విషయమైతే, స్వాతంత్ర్యం పొందినప్పటినుంచీ రాజకీయంగా అమెరికా కంటె ఎక్కువ ఒంటరితనంతో వున్న మెక్సికో, బ్రెజీల్ దేశాలమాటేమిటి? మెక్సికో స్వాతంత్ర్యం పొందిన నాటికి అమెరికా ఎంత విస్తీర్ణం, ఎంత జనాభా కలిగివుందో అది కూడా అంతగా వుంది; బ్రెజీల్ ఇదివరలోనూ, ఇప్పుడూ కూడా అమెరికాకంటె పెద్ద దేశం; దానిలో ఇప్పటి జనాభా, 1790 లో అమెరికాలోవున్న జనాభాతో సమానం. ఎన్నో సంవత్సరాలు గడచిపోయాయి; మెక్సికో, బ్రెజీల్ దేశాలు ఆర్థికంగా వృద్ధి చెందాయి; కాని, వాటి సౌభాగ్యం అమెరికా ముందు ఒక లెక్క కాదు.

**జాతి విభేదం హేతువు కాదు**

కొన్ని జాతులు మిగతావాటి కంటె గొప్పవనీ, ఆ జాతుల సాంస్కృతిక పరిణామాలకు (ఆర్థిక వ్యవస్థలోని పరిణామాలతోసహా) వాటి గొప్పదనమే కారణమనీ జాతితత్వ శాస్త్రవేత్తలు చాలాకాలంగా తమ సొంత కారణం చెబుతున్నారు. యాంకీలను గురించి, ఆంగ్లో - శాక్సన్లను గురించి, లేదా, జర్మనులను స్కాండినేవియనులను కూడా చేర్చేటప్పుడు ట్యుటోనిక్ ప్రజలనే వారినిగురించి ఎన్నో వాదాలున్నాయి. వీరందరూ ఎంత కలగాపులగమైన జాతులవారో, ఒకే జాతి ప్రజల అనుభవాలు ఎంత భిన్నంగా వుంటాయో మరచిపోయి అటువంటివాదం చేస్తూవుంటారు. ఒక జాతి గొప్పదనీ, ఒక జాతి తక్కువదనీ చెప్పేవారి వాదాన్ని నిరాకరించబోయామంటే మనం ఉదారవాదులం కాము. దేహచ్ఛాయలు వేరుగా ఉండవచ్చు; తలల ఆకారాలు వేరుగా వుండవచ్చు. కాని, ఎక్కడివారైనా సరే మానవులందరూ ఒక్క లాంటి వారే. ఒకజాతి తక్కువదనీ, మరొకటి గొప్పదనీ, అందుచేత వారి వారి ఆర్థిక వ్యవస్థలు తేడాగా వుండక తప్పదనీ చెప్పజాలము. ఎందుకంటే, 2000 సంవత్సరాల నాడు సిరిసంపదలతో తులదూగిన సిరియనులూ, ఈనాటి సిరియనులూ ఒకరే; 1000 సంవత్సరాలనాడు పేదరికం అనుభవించిన స్వీడన్ ప్రజలూ, ఈనాడు సౌభాగ్యవంతులైన స్వీడన్ ప్రజలూ ఒక జాతి వారే. తేడా కనిపిస్తున్నది మానవులు

పెంపొందించుకున్న సంస్కృతులలోగాని వివిధ జాతులవారనే విషయంలో కాదు. సంస్కృతులు వేర్వేరుగా వున్నాయి గనుక ఉత్పత్తుల స్థాయి, వాటి వినియోగపు స్థాయి వేర్వేరుగా వున్నాయని మనం సరిగా గ్రహించినట్లయితే, మానవుడు తనకు లభ్యమైన ఆర్థికావకాశాలను ఏమి చేస్తాడో వాటిని బట్టి ఈ స్థాయీలు వుంటాయని అర్థం చేసుకుంటాము.

**ఈ విధానం వహించిన పాత్ర**

ఆర్థికాభివృద్ధికి సహజ సంపదలు, భౌగోళిక పరిస్థితి, జాతి పరిస్థితులతో మాత్రమేకాక ముఖ్యంగా ప్రజలను కదిలించే లక్ష్యాలతో, నేలను, శ్రమను, ధనాన్ని వారు వినియోగించే పద్ధతితో, తమ ఆర్థిక కార్య కలాపాల కోసం ఏర్పరచుకొన్న మార్గాన్ని సంఘటితంగా అనుసరించడంతో సంబంధం వున్నదని భావించడం సహేతుకంగా వుంటుంది. ఒక దేశం వున్నదనుకుందాం ; దానిలో వున్న సహజ సంపదలు ఎప్పుడూ ఒక్కలాగే వున్నవనుకుందాం ; దానిలో మానవులు ఎప్పుడూ ఒక్కరే అనుకుందాం. అటువంటప్పుడు దానిలో యూరపియన్ కాపిటలిజాన్ని అనుసరిస్తే ఒక విధమైన ఫలితాలు కలుగుతాయి ; అమెరికన్ కాపిటలిజాన్ని అనుసరిస్తే మరొక విధమైన ఫలితాలు కలుగుతాయి ; సమష్టి విధానాన్ని అనుసరిస్తే మరొక విధమైన ఫలితాలు కలుగుతాయి ; అదే రీతిగా ఒక్కొక్క విధానాన్ని అనుసరిస్తే ఒక్కొక్క రకం ఫలితం కలుగుతుందిగాని, ఏది అనుసరించినా ఒకే ఫలితం కలగదు. అమెరికా విషయం ఆలోచిస్తే, భూసారం, గనులు, ప్రజలు మూలంగా మాత్రమే అది సౌభాగ్యవంతం కాలేదు. ముఖ్యంగా, అమెరికనులందరిలో జీర్ణించిన ఆశలనుబట్టి, వారి భావసంపద బట్టి, వారు తమ ఆర్థిక యత్నాలను సంఘటితం చేసుకొన్న మార్గాన్ని బట్టి అమెరికా సౌభాగ్యవంతమైంది.

## స్వేచ్ఛా వ్యాపారం

**చట్టబద్ధమైన కాపిటలిజం**

కాపిటలిజాన్ని స్వేచ్ఛా వ్యాపారం (ఫ్రీ ఎంటర్ ప్రయిజ్) అని పిలుచుకొనడం అమెరికనులకు సరదా. వారు కాపిటలిజం అంటున్నది ఇది : ప్రయివేటు వ్యక్తుల సొంత ధనానికి అత్యంత ప్రధాన పాత్ర నివ్వగల ఆర్థిక

వ్యవస్థ వుండి, ఫ్యాక్టరీల నిర్వహణ బాధ్యత సొంత దారులకువుంది, ఫ్యాక్టరీలు సామర్థ్యంతో పనిచేయడమే సొంత దారులయొక్క, నిర్వాహకుల యొక్క ముఖ్య కర్తవ్యమై, లాభాలను తమ యితర ప్రయోజనాలకు కాక అదే వ్యాపార వృద్ధికి వినియోగించాలని సొంతదారులు ప్రధానంగా భావించే వ్యవస్థ అది. ఈ కాపిటలిజంలోని అసలు లక్షణం ఇది: వివిధ వ్యాపార శక్తులు ఒకరి సహాయం లేకుండా తమంతట తామే ఒకదాని నొకటి కాపాడు కొంటూ, ఒకదాని నొకటి అతిక్రమించిపోక, పోటీ పడడానికి వీలిచ్చిన శాసనం చేసుకొనడం. "ఫార్చ్యూన్" పత్రిక ఎడిటర్లు తాము వ్రాసిన "అమెరికా—శాశ్వత విప్లవం" అనే గ్రంథంలో "పెద్ద కార్మిక వర్గం, పెద్ద వ్యవసాయ రంగం, అపారంగా వున్న చిన్న వ్యాపారాలు, పెద్దవ్యాపారాలు" ఇవన్నీ అమెరికాలో వున్న గొప్ప విషయాలన్నారు; ఇవికాక ఇంకా ఇతర విషయాలుకూడా వున్నాయిలెండి.

ఆర్థిక స్వేచ్ఛ వుండాలంటే అందుకు శాస ప్రజాస్వామికమైన నాలు చెయ్యరాదనే అభిప్రాయాన్ని యూరప్ కాపిటలిజం కంటె అమెరికా త్వరగా విడనాడింది గనుకనే అక్కడి విధానం తీసికట్టు కాలేదు. ఆర్థిక స్వేచ్ఛను నాశనంచేసే గుత్త వ్యాపారం క్రిందకు అది దిగజారలేదు. సమష్టి విధానానికీ, వర్గ విధానానికీ, నూతన పద్ధతిలో వ్యాపారవర్గ విధానానికీ దారి తీసేది ఈ గుత్త వ్యాపారమే. "ఆరు కోట్ల ఉద్యోగాలు (Sixty Million Jobs)" అనే గ్రంథంలో వాలెస్ "ఆర్థిక ప్రజాస్వామ్యం" అన్న దానికి "వివిధ వర్గాలవారు బేరాలు జరుపుకోడానికి సమానహక్కు వుండి తీరడం" అని అర్థం చెప్పాడు. ఈ అర్థంతో చూస్తే అమెరికా ఆర్థిక రంగం మరింత ఉత్తమ ప్రజాస్వామ్యం దిశగా పురోగమించడం,యూరప్‌లో కొలదిమంది వ్యాపారస్థులు మాత్రం క్రమంగా శక్తిమంతులు కావడం జరిగింది. ఇటలీ రిపబ్లిక్ మాజీ ప్రెసిడెంటు లుయిగీ ఎయినాడీ ఈనాడు యూరప్‌లోకల్లా గొప్ప ఆర్థిక శాస్త్రవేత్త. ఆయన చెప్పిన మాటలలో వున్నదే అమెరికా విధానంలో వున్నదని చెప్పవచ్చు. ఆయన అన్నదిది: "పౌరుడు స్వేచ్ఛగా వుండాలి గనుక శాసనాలు రద్దుచెయ్యాలనేది లక్ష్యంగా వుండకూడదు; అతడు స్వేచ్ఛగా వర్తించడానికి వీలిచ్చే శాసనాలను చెయ్యడం లక్ష్యంగా పెట్టుకోవాలి."

మూడు ప్రధాన లక్షణాలు

అమెరికా స్వేచ్ఛా వ్యాపార సరళిలో—ముఖ్యంగా అది గత 70 సంవత్సరాలలో పొందిన స్వరూపాన్ని బట్టి చూస్తే—ఈ క్రింది మూడుప్రధాన లక్షణాలు కనిపిస్తాయి :

ఆస్తి వినియోగంలో ప్రజలకు స్వేచ్ఛ

(ఎ) ఎవరైనా సరే తమకున్న ఆస్తినో, శక్తినో, బుద్ధినో తమకు యధోచితమైన రీతిని అనేక విధాలుగా ఉపయోగించుకో వచ్చును. ఇది చట్టానికి లోబడి చెయ్యాలి. పరిశ్రమలలో ధనం పెట్టుబడి పెట్టిన అనేక లక్షల మందికి, భూకామందులైన నలభై లక్షలమందికి, కార్మికులకు, బుద్ధి జీవులకు తదితరులకు ఈ అవకాశం వుంది. తమ ప్రయత్నాలకు సాధ్యమైనంతగా అత్యధిక లాభాలను పొందడం వారి లక్ష్యం. దానిని అన్ని వర్గాల అమెరికనులలో అధిక సంఖ్యాకులు ఆమోదించారు. తాము పడిన శ్రమకు అత్యధిక ఫలితాన్ని పొందాలనీ, తమ పెట్టుబడి ధనానికి అత్యధికంగా లాభాలు రావాలనీ వారు లక్ష్యంగా పెట్టుకుంటారు. లాభం పొందిన వారిని మెచ్చుకుంటారేగాని, ఖండించరు. లాభం పొందడం సిగ్గు చేటైన పని లాగ అనేక దేశాలలో చూస్తున్నట్లు అమెరికాలో హీనంగా చూడరు.

పోటీ పద్ధతి; దానికి ఆటంకాలు

(బి) ఆర్థిక రంగంలో పోటీ విధిగా వుండాలి. దీనినిబట్టి, ప్రతిచోటా ఎల్లప్పుడూ పోటీ వుందని కాదు. పోటీకి పరిమితి వుంది; ఆర్థిక రంగంలో పోటీ పడడానికి వీలు కాకుండా చెయ్యబడిన అంశాలు ఎన్నో వున్నాయి. కాని, మొత్తం ఆర్థిక విధానాన్ని తీసుకుంటే, ఈ విధానం పని చేస్తూండడానికి ఆధారభూతమయే పోటీ తగినంత వుంది. చాలావరకు స్వేచ్ఛా వాతావరణం గల వ్యాపార రంగంలో తమ ఇచ్చవచ్చినట్లు ఉత్పత్తులు చేసే యూనిట్‌లు అనేక లక్షలున్నాయి. ఇది హర్షించదగిన విషయం. ఇది ఇలా వుండగా, వస్తువులను కొనుక్కొనే ప్రజలు ఉత్పత్తిదారులమీద వొత్తిడి కలిగిస్తారు; కార్మికులు మేనేజిమెంటుమీద వొత్తిడి కలిగిస్తారు; ప్రభుత్వం ప్రయివేటు వ్యక్తులమీద వొత్తిడి కలిగిస్తుంది. వాటికితోడు, వ్యవసాయదారులు, పారిశ్రామికులు, పెద్ద వ్యాపారులు, చిన్న వ్యాపారులు వివాదపడుతూంటారు.

(సి) వివిధ వర్గాల ప్రజాభీష్టాన్ని అనుస ప్రభుత్వంయొక్క
రించి కాంగ్రెసువారు ఆర్థికశాసనాలను చెయ్య అభిప్రాయం
డంలోవున్న అభిప్రాయం స్వేచ్ఛావ్యాపారాన్ని కాపాడడం. అంతేకాదు, ఇతర ఆర్థిక విధానాలన్నింటిలో వున్నట్టే కాపిటలిజంలోకూడా ఆర్థిక స్వేచ్ఛను అరికట్టే ప్రమాదాలు రావడానికి అవకాశం వుంది; అందుచేత, ఆ ప్రమాదాలు ఏర్పడకుండా చెయ్యాలని కాంగ్రెసు చేసే శాసనాల ఉద్దేశం. అమెరికనులు విధించుకున్న నియమాలు కొల్లలుగా వున్నాయి: అయితే వారు స్వేచ్ఛగా జీవించ నిర్ణయించుకొన్నారని అవి చాటుతాయి. గుత్త వ్యాపారస్తుల నుంచి స్వేచ్ఛా వ్యాపారానికి ప్రమాదం రాకుండా ప్రభుత్వం హామీయిస్తున్నదని హక్కులబిల్లులో ఒక హక్కు చేర్చడానికి జఫర్సన్ ప్రయత్నించాడు. ఆయన ప్రయత్నం ఫలించలేదు. కాని, అటువంటి సూత్రం వున్నదన్నట్టుగా కాంగ్రెసు, సుప్రీం కోర్టు చర్యలు తీసుకుంటున్నాయి. ఆ చర్యలు హామిల్టన్ విశ్వాసాన్ని ప్రతిఫలిస్తున్నాయి. హామిల్టన్ విశ్వాసం ఇది: "స్వేచ్ఛా వ్యాపార విధానానికి ప్రోత్సాహ మివ్వడం ప్రభుత్వ బాధ్యత. కేవలం ప్రజా క్షేమం కోసమని కాకుండా, అది నిరంతరం వృద్ధిపొందుతూండేటట్లు చేయడం ప్రభుత్వ బాధ్యత."

ఏ యూరపియన్ దేశంలోనైనాగాని, ఎప్పు ప్రజల తోడ్పాటు
డైనా గాని కాపిటలిజం వుండాలన్న ప్రజలు మెజారి
టీలో వున్నారా అనేది సందేహం. అత్యధిక సందర్భాలలో అత్యధిక కాలంపాటు కాపిటలిజాన్ని వారు అంగీకరించారేగాని దానికి ఇష్టపడ లేదు. అమెరికనులు అలాగ కాదు. వ్యవసాయదారులు, కార్మికులు, వ్యాపారస్తులు, ప్రజలు ఎవరిమట్టుకు వారు కాపిటలిజాన్ని విమర్శించ డానికి ఏదో ఒక కారణం వుంటుంది. కాని, "స్వేచ్ఛా వ్యాపారం చెడ్డది. మరొక విధానాన్ని అనుసరించుదాం" అని చెప్పేవారు బహు స్వల్పం; సమష్టివాదం పేరు చెప్పగానే అమెరికనుల కళ్ళకు నిర్బంధ బానిస శిబిరాలు కనిపిస్తాయి; భోగలాలసులైన పరిపాలకులు కనిపిస్తారు; కొరడా దెబ్బలు తింటూ పనిచేస్తున్న కార్మికులు కనిపిస్తారు. యూరప్‌లోవున్న నూతన వ్యాపార ఆర్థికవిధానం, వర్గప్రాబల్య ఆర్థికవిధానం పేర్లు చెప్పగానే అమెరి కనుల కళ్ళకు అభివృద్ధి నిరోధక స్థితి గోచరిస్తుంది; సబ్సిడీలు, సహాయాలు



అమెరికాలో సొంతంగా కష్టపడి పని చేసుకొనేవాడు ఆస్తిపరుడవుతాడు. సాధారణంగా, అది పెద్ద ఆస్తి కాకపోవచ్చు గాని, అతడు సంతోషపడడానికీ, తన కుటుంబం క్షేమంగా వుంటుందని అతడికి ధైర్యం కలగడానికీ సరిపోతుంది.

అడిగే దేశాలు కనిపిస్తాయి. ఈ దారుణాలన్నీ వాటికి జ్ఞాపకం వస్తాయి. అందుచేత, తమ విధానాన్ని విడనాడాలనేమాట చెప్పేవరికి భయకంపితు లవుతారు. తమ విధానంలో వరుసగా ఈ నాలుగు ప్రయోజనాలు వున్నా యని వారు చెబుతారు: (1) అది యావన్మందికీ ఉత్తమ జీవన ప్రమాణాన్ని లభింప జేస్తుంది; (2) అది సమర్థనీయమైంది; (3) ఒక వ్యక్తి, అతడి కుటుంబం తమ ఇష్టానుసారం జీవితం గడపడానికి వీలు కలిగిస్తుంది (బుద్ధిజీవుడు ఇలా అంటాడు : అది పౌరుని స్వేచ్ఛను బలీయం చేస్తుంది); (4) అది ఎడతెగకుండా సాంఘిక, సాంస్కృతిక అభ్యుదయానికి దోహద మిస్తుంది.

**మితిమీరిన ఆశ కాదు**

అమెరికనులు తమ ఆర్థికవిధానం లోపరహితమైన దని ఎన్నడూ చెప్పరు. కాని, అమెరికన్ జాతిలో గొంతెమ్మ కోరికలు కోరే గుణం లేదు. దేనినైనా సరే నిర్దుష్టంగా చెయ్యాలనేది అమెరికన్ సంస్కృతిలో ఒక ముఖ్యలక్షణంగా కని పిస్తుంది. ఆ లక్షణం విచిత్రంగా తోచవచ్చు. ఎందుకంటే, ఏ పశ్చిమ దేశంలోకంటెకూడా అమెరికాలో "ఊహాసౌధాలు నిర్మించుకొనే" సంఘాలు ఎక్కువగా వున్నాయి గనుక, అమెరికనులు మితిమీరిన కలలు కంటారని అనిపిస్తుంది. గతంలో ఏమి జరిగి వున్నప్పటికీ, ఈనాడు అమెరి కాలో కలలు కనే స్వభావమేమి, ప్రతిదీ నిర్దుష్టంగా వుండాలనే భావమేమి యూరప్‌లోకంటె, లేదా ఆసియాలోకంటె తక్కువ. సమష్టి వాదులలాగ, వర్గవిధాన వాదులలాగ కాకుండా అమెరికనులు తమ లోపాలను, తమ పొర పాట్లను మనసారా ఒప్పుకుంటారు. అందుచేత, ఏమవుతున్నదంటే, తమ విధానాన్ని నిరంతరం సంస్కరించుకోడానికి ఇష్టపడుతూ వుంటారు. సమస్త మానవ వ్యవస్థలలాగే అదికూడా వృద్ధి పొందాలంటే సంస్కరించబడుతూ వుండడం అవసరం. అమెరికనులలో మరొక లక్షణంకూడా వుంది. ప్రజా స్వామిక పద్ధతిగా తప్ప మరొక విధంగా ప్రవేశపెట్టే సంస్కరణలకు వారు సమ్మతించరు (ఇందుకు వ్యతిరేకులు బహు కొద్దిమంది ఎప్పుడూ వుంటూనే వుంటారు).

# ఆస్తిపాస్తులు

ఆస్తి అవసరం ఆర్థిక కారణాల చేతనే కానివ్వండి, నీతి బోధకే కానివ్వండి, ఆస్తిపరులంటూ వుండరాదని సోషలిస్టులు విమర్శిస్తారు. ఈ వాదానికి నేటి అమెరికాలో స్థానంలేదు. ఏ అంతస్థులోని అమెరికనులైనా సరే ఆస్తిపరుడు కావడం మంచి విషయమనీ, దానివల్ల స్వేచ్ఛ, ఆర్థికభద్రత లభిస్తాయి గనుక అది అమూల్యమైనదనీ గట్టిగా నమ్ముతారు. ఎక్కడైనాసరే ఆస్తిపరునకే గౌరవం యిస్తారు; మనకు తెలిసినంతవరకు సోవియట్ యూనియన్‌లోకూడా ఇంతే; అమెరికాలో మరింత గౌరవమిస్తారు; అందులోనూ, ఒక వ్యక్తి సొంతంగా కష్టపడి, సొంత ప్రయత్నాలవల్ల ఆస్తిపరుడయాడంటే చెప్పలేనంత గౌరవం. యూరప్‌లో కంటె అమెరికాలో యువకులు ముందుగానే సంపాదనకు పూనుకుంటారు. అమెరికన్ యువకుడుగాని యువతిగాని సంపాదనకు పూనుకొన్ననాడే మనస్సులో ఒక లక్ష్యం స్థిరపడిపోతుంది: ఎప్పటికైనా తనకు సొంత ఆస్తి వుండాలనే లక్ష్యం.

ఆస్తిపై హక్కు 1950 లో జరిగిన ఒక సర్వే ప్రకారం, అమెరికాలోని అయిదుకోట్ల కుటుంబాలలో నూటికి ఎనిమిది వంతుల కుటుంబాలకు మాత్రమే సొంత ఆస్తి లేదు. భూములు, పరిశ్రమలలో షేర్లు, బ్యాంకులో నిల్వ, ఇలాంటివన్నీ సొంత ఆస్తి క్రిందకు వస్తాయి. 1956 ఫిబ్రవరిలో వెలువడిన "అమెరికాలో ప్రజల కాపిటలిజం" అనే కరపత్రంలో ఈ విధంగా తెల్పబడింది: "సేవింగ్సు అకౌంట్లు వున్నవారు (అమెరికనులు) ఏడుకోట్ల మంది, జీవిత భీమా చేయించుకొన్నవారు 11 కోట్ల 50 లక్షల మంది, షేర్లు వున్నవారు 70 లక్షల మంది వున్నారు." అనేక దశాబ్దాలుగా ఆస్తిపరుల సంఖ్య హెచ్చుతూంది. ఉదాహరణకు ఒక విషయం చూదాం: 1860–1910 మధ్య అమెరికా జనాభా రెండింతలయింది (హెచ్చుగా పారిశ్రామికాభివృద్ధి జరిగి, వేర్వేరు కంపెనీలు ఒక్కొక్క పెద్ద కంపెనీగా కలిసిపోయిన కాలమది). జనాభా ఇంతగా పెరిగినప్పటికీ, భూకామందుల సంఖ్య, సొంత వ్యాపారస్తుల సంఖ్య, ఉద్యోగుల సంఖ్య కూడా అదేవిధంగా రెండింతలు పెరిగాయి. ఇక, వ్యాపారాలలోను, పరిశ్రమలలోను షేర్లు వున్న

వారి సంఖ్య రెండింతలకు పైగా కూడా హెచ్చింది. సాధారణంగా సొంత ఆస్తిఅంటే పెద్దదేమీ వుండదు ; దానిని సంపాదించుకున్నవాడు గర్వ పడడానికీ, తనకేమీ ఫరవాలేదన్నంత ధైర్యం కలగడానికీ సరిపోయేటంత వుంటుంది. 1820 లగాయతు అమెరికాకు వలసవెళ్ళిన నాలుగుకోట్లమంది యూరపియనులకు, లక్షలాదిమంది ఇతరులకూ బలము, పని చేసుకోవాలనే వాంఛ తప్ప మరేమీ లేవు. అందుచేత, అమెరికాలో ఆస్తి పంపకమైన పద్ధతి నిజంగా అద్భుతమైనది.

అంపెరికీ కాపిటలిజం

చాలా సందర్భాలలో, ముఖ్యంగా ఒక డజను పరిశ్రమలలో, నిర్వహణాధికారం కేవలం కొలది మంది హస్తగతమై వున్నదనేది నిజం (ఉక్కు, మోటారుకార్లు, ఎలక్ట్రిసిటీ, రసాయనాలు, రబ్బరు మొదలైన పరిశ్రమలు). అయితే, ఈ పరిశ్రమల సొంతదార్లు మాత్రం అనేకులున్నారు. లెక్కలలో తేడా వుంటేవుండవచ్చుగాని, బహుశా 70 లక్షల మందికిపైగా షేర్లు వున్న కంపెనీలు అయిదు లక్షలకు పైన వున్నాయి. ఈనాడు అమెరికాలో వ్యవసాయదారులు కాక, విడి మనుష్యుల చేతుల్లో 35 లక్షల వ్యాపారాలున్నాయి. ఇవి కంపెనీలు కావు. వీటిలో కొన్నింటికి ఒక్కొక్కడు సొంతదారు; మిగతావి భాగస్తులున్నవి. సొంత సేద్యగాళ్ళలో నలభై లక్షలమందికి (వ్యవసాయదారులలో నూటికి 68 మందికి) సొంత భూములున్నాయి. ఏదో ఒక రకం వస్తువులు తయారు చేయడమే కాక, వాటిలో నైపుణ్యం చూపుతూ, ఇతరులకు శిక్షణ యిస్తూ వున్న స్వతంత్ర వృత్తిపరులు అయిదు లక్షల మందికిపైగా వున్నారు. అయితే, పైన పేర్కొన్న నాలుగు వర్గాలవారిలో సొంత ఆస్తులూ, షేర్లూకూడా వున్నవారు కొందరు, భూములూ షేర్లూ వున్నవారు కొందరు లేకపోలేదు. ఏమైనా, మొత్తం కుటుంబాలలో మూడవ వంతు కుటుంబాలకు సొంత భూములు, పరిశ్రమలలో షేర్లు వున్నాయనడం బహుశా సత్యదూరం కాదు. (పశ్చిమ యూరప్‌లో ఎక్కువ పరిశ్రమలు గల ఏ దేశం లోకంటె కూడా ఇది ఎక్కువ). ఇతర కుటుంబాలకు సొంత ఇళ్ళు, సొంత కార్లు, సొంత సామానులు మొదలైనవీ, గవర్నమెంటు బాండులు, ఇన్సూరెన్సులు, సేవింగ్సులు మొదలైనవీ వున్నాయి. అంటే, వారు కూడా సొంత ఆస్తి కలవారమనీ, లేదా "కాపిటలిస్టులం" అనీ భావించుకోగలరు. అనేక

ఇతర దేశాలలో ఆస్తిపరులనీ, ఆస్తిపరులు కానివారనీ స్పష్టంగా భేదం వుంది. అమెరికాలోనూ, అదేవిధంగా కెనడాలోనూ వున్న ప్రజలు ఆ విధంగాకాక, వేర్వేరు అంతస్థులలోవున్న ఆస్తిపరులని చెబితే సరిగా చెప్పడమవుతుంది. అమెరికాలో ఇప్పటికీ శ్రమజీవుల వర్గం వుంది—ఈ వర్గంలోవున్న వారిలో చాలామంది పశ్చిమార్ధగోళంలోని ఇతర దేశాలనుంచి వచ్చిన వలసదారులు ; అమెరికా మొత్తం జనాభాతో పోల్చి చూస్తే ఈ శ్రమజీవుల సంఖ్య తగ్గిపోతూంది ; ఇప్పటిలాగే జరుగుతూ వుంటే, వచ్చేతరంలో శ్రమజీవుల వర్గమనేదే వుండదు.

అమెరికాలో ఆస్తి విభజన చాలా వరకు తెలిసి అనుసరించిన పద్ధతి బుద్ధిపూర్వకంగా అనుసరించిన విధానం యొక్క ఫలితం. సొంత ఆస్తిని సంపాదించుకొనడం ఘనకార్యమనే భావం యువకులకు నూరి పోస్తారు. అంతేకాదు. ప్రజలు సొంత ఆస్తిపరులు కావడానికి అటు ప్రభుత్వమూ, ఇటు ప్రయివేటు వ్యక్తులూ పనికట్టుకొని ప్రయత్నాలు చేశారు. 1862 లో చెయ్యబడిన హోమ్‌స్టెడ్ చట్టం కౌలుదారీ రైతులను సృష్టించడానికి ఉద్దేశించబడిన చట్టంకాదు ; అది, సొంత వ్యవసాయదారుల సంఖ్యను పెంచడానికి ఉద్దేశించబడింది. అంతకు ముందునంవత్సరంలో చెయ్యబడిన రష్యన్ ఇమాన్సిపేషన్ చట్టంలోని నియమావళితోగాని, ఇటీవలి దశాబ్దాలలో భూ సంస్కరణలకోసం జరిగిన అల్ప ప్రయత్నాలతోగాని దానిని పోల్చి చూస్తే చాలు ఒక విషయం స్పష్టంగా కనిపిస్తుంది; ఆస్తి సమస్యా పరిష్కారానికి యూరప్, అమెరికాలు అనుసరించిన మార్గాలలో ఎంత తేడా వున్నదీ ఇట్టే గ్రహింపు అవుతుంది. "టైమ్" పత్రిక వ్రాసినట్లు, 1945 నుంచి "ఉద్యోగాలలో వున్నవారు షేర్లు కొనుక్కోడానికి ఉద్దేశించబడిన ప్లానులు వ్యాప్తి చెందాయి....20 లక్షల మంది జీతగాళ్ళు, కార్మికులు షేర్లు కొనుక్కోడానికి వారు పనిచేస్తున్న 300 కంపెనీలు ఇప్పుడు కార్యక్రమాలు తయారు చేసుకొన్నాయి." లాభాల పంపకానికి సంబంధించిన ప్లానులు కూడా ఎక్కువయాయి; జీతగాళ్ళే ఈ కంపెనీల యజమానులు కావడానికి ఇవి బాగా ఉపయోగించక పోవచ్చుగాని, వారు సొంత ఆస్తిపరులుగా ఆనందపడడానికి ఇవి ఉపయోగపడుతాయి. పరిశ్రమలలో షేర్లుగల వారి సంఖ్య ఒకేవొక సంవత్సరంలో నూటికి పదివంతులు చొప్పున పెరిగింది.

# కార్మిక – యజమానుల జాతి

శ్రమకువున్న గౌరవం

యూరప్‌లో కాపిటలిజం రూపొందక పూర్వం నుంచీ, సొంతగాళ్ళు ఒకరు, కార్మికులు వేరొకరుగా వుండడం జరిగింది. కాపిటలిజం వ్యాప్తి చెందుతూన్నంత కాలమూ ఇదే పరిస్థితి వుంది. కొన్నిచోట్ల (ఇంగ్లండు, ఇటలీలు) వీరుభయుల మధ్య పెద్ద అగాధం ఏర్పడింది. ఈ విషయంలో అమెరికాలోవున్న పరిస్థితి వేరు; కొన్ని తరాలనుంచీకూడా ఇది వేరుగానే వుంది. అమెరికనులలో కాయకష్టం చెయ్యగలిగిన వారందరూ చేస్తారు ; కడుపులో చల్ల కదలకుండా కూర్చోగలిగినంత పెద్ద ఆదాయం గలవారిలో అధిక సంఖ్యాకులు కూడా చేస్తారు. అమెరికనులు సొంత పనివారో, లేదా ఇంకొకచోట పనిచేసేవారో అయి వుంటారు- వీరిలో మొదటి రకంవారు మొత్తం కార్మికులలో అయిదవ వంతు మంది, రెండవ రకంవారు మిగతా నాలుగువంతుల మంది వున్నారు. (వీరందరూ సుమారు 6కోట్ల 50 లక్షలమంది); ఎంతో భాగ్యవంతమైన దేశం కావచ్చుగాని, అక్కడ సోమరితనాన్ని చీదరించుకుంటారు ; సంఘానికి చీడపురుగులుగా ఎవళ్ళూ లేరు. యూరపియన్ దేశాలలో, కాయకష్టానికి అమెరికాలో వున్నంత గొప్ప మర్యాదవున్న దేశం బహుశా స్విట్జర్లాండు ఒక్కటే. పని చేసే ప్రతివాడు లాభంకోసమో, జీతంకోసమో చేస్తున్నాడనికాదు; కాని, ప్రతి మనిషీ పనిచేస్తాడు (అయితే, కొందరు వ్యక్తులు అలాగకాదు లెండి. ఇటువంటివారు ముఖ్యంగా పశ్చిమ యూరప్ నుంచీ, దక్షిణ అమెరికా దేశాలనుంచీ అమెరికాకు విలాసం కోసం వచ్చే ప్రాంతాలలో కనిపిస్తారు). "టైమ్ ఫర్ లివింగ్" అనే గ్రంథంలో సూల్ వ్రాసినట్లు, "కృషి చేయడం నైతిక ధర్మం" అనేది అమెరికా జాతి స్వభావం.

కార్మికులు, పెట్టుబడి దారులు చాలావరకు ఒకరే

ఒక సందర్భంలో లింకన్ ఇలా వ్రాశాడు: "తగినంతమంది ప్రజలు తమ శ్రమను పెట్టుబడి ధనానికి తోడుగా ఉపయోగిస్తారు." ఈ నాటికీ ఇది నిజం. ఎందుకంటే, అమెరికనులలో అత్యధిక సంఖ్యాకులు ఒక పరిశ్రమలో భాగస్వాములై, అదే సమయంలో దానిలో పనిచేస్తారు. పశ్చిమ యూరప్‌లో లాగ కాపిటలిస్టుల వర్గమనీ, కార్మికుల వర్గమనీ గీతగీయడానికి అమెరికాలో వీల్లేదు. కార్మికుడే

ఆస్తిపరుడు; ఆస్తిపరుడే కార్మికుడు. బహుశా, అమెరికను కార్మికులలో ఎంతలేదన్నా మూడింట రెండువంతుల మందికి తమ పనులవల్లనే కాక, పెట్టుబడి ధనంవల్ల కూడా ఆదాయం వస్తుంది; అయితే, ఈ ఆదాయాలు కొందరికి ఎక్కువ, కొందరికి తక్కువ రావచ్చు. పారిశ్రామిక విప్లవం కారణంగా ఇతర దేశాలలో సొంతగాళ్ళనీ, కార్మికులనీ రెండు వర్గాలు ఏర్పడ్డాయి. కమ్యూనిజం లేని చాలా దేశాలలో ఇదొక లక్షణంగా కనిపిస్తుంది. అమెరికాలో అలాగ గీతగీసి చెప్పడానికి వీలు లేదు. ఎందుకంటే, సొంత గాళ్ళు, కార్మికులు చాలావరకు ఒకరే.

మేనేజర్ల వర్గం

సొంత ఆస్తిపరులు విపరీతంగా వుండడంచేత, వ్యవసాయం మినహా మిగతా పనులన్నీ ఎంతో మార్పు చెందాయి. పరిశ్రమలు మొదలైన వాటికి చాలావరకు సొంతదారులు వేరు, మేనేజిమెంటు వేరు. ప్రజలకు సొంత ఆస్తిపై హక్కు వున్న మరేదేశంలోనూ కనివిని యెరుగనంతగా అమెరికన్ పరిశ్రమల మేనేజిమెంటు అభివృద్ధి చెందినదంటే అతిశయోక్తి ఏమీ లేదు. మేనేజిమెంటు వర్గంలో లక్షలాది ప్రజలున్నారు: అమెరికాలో చాకచక్యం వున్నవానికల్లా మంచి అవకాశాలు వున్నాయి; వృద్ధిలోకి రావడానికి తెలివి తేటలు, చొరవ, చదువు వుండాలిగాని, ధనమూ పలుకుబడీ కాదు. పరిశ్రమలు ఇంకా వృద్ధి అయేకొలదీ మేనేజిమెంటు వర్గానికి అటు సొంతదారులనుంచీ, ఇటు పనివారినుంచీ మరింత ప్రాముఖ్యం వస్తుంది. ఇందువల్ల సొంతదారులకు, కార్మికులకు మధ్య సంబంధాలు ఇంకా సుగమం అవుతాయి కూడా. సామాన్యంగా బాగా చదువు కున్నవాళ్ళు మేనేజరులవుతారు; సొంతదారుల కున్నంత స్వలాభాపేక్ష వీరికి వుండకపోవడం సహజం; తమ సంస్థ వృద్ధిలోకి రావడానికి కార్మికులు పట్టు కొమ్మలని వీరు తలపోస్తారు; వివిధ అభిమతాలను, లాభాపేక్షలను, జీతాల కోరికలను వీరు సమన్వయపరచి ఒక దారికి తెస్తారు.

## విక్రేతల పాత్ర

ప్రజలకంటె ధనికులు ముఖ్యమా?

సరకులను కొనేవారినిబట్టి వస్తువుల ఉత్పత్తి జరుగు తుందని సర్వత్రా తెలిసిన విషయమే. అన్ని ఆర్థిక విధా నాలలోనూ ఇంతే. యూరప్‌లో పెద్ద పారిశ్రామికులు చాలా కాలంపాటు ధనవంతులకు అవసరమైన సరకులను ఉత్పత్తి చేసేవారు.




అమెరికాలో కార్మికులకు కూడా ఆస్తులుంటాయి; ఆస్తులున్నవారుకూడా పనులు చేస్తారు. ప్రజలలో బహుశా మూడింట రెండువంతుల మందికి తమ తమ వృత్తులవల్ల మాత్రమే కాక, షేర్లు మొదలైన ఆస్తులవల్లకూడా ఆదాయాలు వస్తాయి.

ఇలాగ జరగడానికి కారణం బహుశా, జాతీయ ఆదాయంలో ఈ కొద్దిమంది ధన వంతులకే హెచ్చుభాగం దక్కుతుంది గనుక వారికోసమే సరకులను ఉత్పత్తి చేయాలని పారిశ్రామికులు ఊహించుకొని వుండడం కావచ్చు. మరొకటికూడా జరిగి వుండవచ్చు. "సంఘానికి ఈ కొలదిమంది ధనవంతులూ జీవం; వారి కోసమే మిగతా వారందరూ" అనే అభిప్రాయం యూరపులో ఆనాడు ప్రబలంగా వుంది. ఆనాడు యూరపియన్ కాపిటలిజంలోకూడా ఇదే అభిప్రాయం ప్రబలివుంటుంది.

ధనికులకంటె ప్రజలు ముఖ్యమా ?

సరకుల ఉత్పత్తికి, వాటి వినియోగానికి వున్న సంబంధాన్ని అమెరికాలో పై విధంగా కాక మరొక విధంగా అర్థం చేసుకున్నారు. ఎక్కువ లాభాలను సంపాదించాలంటే, అంత కంతకు ఎక్కువమంది ప్రజలకు కావలసిన సరకులను తయారు చేయాలని అమెరికన్ పారిశ్రామిక వేత్తలు ఏనాడో గ్రహించారు. సరకులను అంత కంతకు హెచ్చుమంది కొనుక్కోడానికై వాటి ధరలను తగ్గించడానికి ప్రయత్నాలు చేస్తూండేవారు. ప్రజలకు కొన్ని సరకుల అవసరం కనిపించకపోతే, వాటికి అవసరాన్ని కల్పించాలి: అడ్వర్టయిజు మెంటుల లక్ష్యం ఇదే; ఈ నాడు వ్యాపారవృద్ధికీ, ఉన్నత జీవన ప్రమాణానికీ ఈ అడ్వర్టయిజుమెంటే సాధనం.

విక్రేతల శక్తి కీలకాంశం

అమెరికా ఆర్థిక విధానానికి వస్తువిక్రయదారుడు కీలకం: "ఫార్చ్యూన్" పత్రిక ఎడిటర్లు "ఆర్థిక వ్యవస్థమీద వ్యాపారస్తుల కంట్రోలుకు వున్న ప్రాముఖ్యంకంటె విక్రయదారుని పలుకుబడికి ఎంతో హెచ్చు ప్రాముఖ్యం వచ్చింది," అని వ్రాశారు. "షేరు హోల్డర్లు, కాతాదార్లు, మొత్తంమీద ప్రజలు-వీరందరికీ ప్రయోజనాలు కలిగేలాగ మేనేజర్లు పరిశ్రమలను నిర్వహించితీరాలి." ఏమైనా, తమ కొనుగోలుశక్తిని సాధ్యమైనంతగా హెచ్చించుకోవలసిన పూచీ విక్రేతలమీదనే వుంది. ఇది ప్రభుత్వం, వ్యాపారస్తులు, కార్మికసంఘాలు, వ్యవసాయదారులు, ప్రజాసంఘాలు మొదలైనవారిమీదకూడా వున్న ముఖ్య బాధ్యత. ప్రజల కొనుగోలు శక్తిని హెచ్చించడానికి ఫలానా పద్ధతులను అమలు జరపాలని ఒక వర్గంవారు చేసిన సూచనలకు, మరొక వర్గంవారు చేసిన సూచనలకు

తేడా వుండవచ్చు. కాని, ప్రజల కొనుగోలు శక్తి హెచ్చాలనే ప్రధాన విషయాన్ని మాత్రం అందరూ అంగీకరించారు.

పారిశ్రామికుల వాంఛ, కొనుగోలుదారుల వాంఛ పరస్పర విక్రేతలైన
విరుద్ధమైనవని మాట్లాడడం ఒకప్పుడు పరిపాటిగా వుండేది. కార్మికులు
అమెరికాలో ఈ వైరుధ్యం ఇతర దేశాలలో వున్నంత లేదు.
ఎందుకంటే, పారిశ్రామికుడు, కొనుగోలుదారు రెండు రూపాలలో వున్న ఒకే వ్యక్తి అని అక్కడ గ్రహించారు. అందుచేత, కొనుగోలుదారుని శక్తి హెచ్చించడానికి ఏకైకమార్గం కార్మికుని మొదలుకొని యజమాని వరకు వున్న పనివారి జీతాలను ఉన్నత స్థాయికి పెంచడం. డబ్బు చేసుకోడానికి అమెరికాలో వున్న పద్ధతిని హెన్రీ వాలెస్ ఈ విధంగా వివరించాడు : "తక్కువ ధరలకు లభించే వస్తువులను ఎక్కువగా ఉత్పత్తి చేయడం ; మరింత సామర్థ్యం చూపడం ; హెచ్చు జీతాలు యివ్వడం." అమెరికాలో కొనుగోలుదారుల వ్యక్తిగత ఆదాయాలలో కార్మిక వృత్తివల్ల వచ్చినంతగా (అయిదింట నాలుగు వంతుల పైమాట) మరే విధంగానూ రాదు. యూరపియన్ పరిశ్రమలలోను, సోవియెట్ పరిశ్రమలలోనూ జరుగుతున్నట్లుకాక, అమెరికాలో వస్తువుల ఉత్పత్తికి అయే ఖర్చులలో పెద్ద ఖర్చు కార్మికుల జీతాలే.

కొన్ని తరాల క్రిందట కార్మికులు కావలసినంత మంది హెచ్చుజీతాల
లేనప్పుడు వారికి పారిశ్రామికులు విధిలేక హెచ్చు జీతాలు విధానం
యిచ్చేవారు ; ఈ మధ్య కాలంలో కార్మికుల వొత్తిడివల్ల
జీతాలు హెచ్చాయి. జీతాలు తక్కువగా యివ్వడం పారిశ్రామిక వేత్తకు ఒకడికే లాభం. కాని, వ్యాపారాలు చక్కగా జరగాలంటే యావన్మందికీ హెచ్చు కొనుగోలు శక్తి వుండాలనీ, అంటే జీవన ప్రమాణం హెచ్చు స్థాయిలో వుండాలనీ అమెరికా ప్రజలందరూ భావిస్తారు. వారి అభిప్రాయంతో పారిశ్రామిక వేత్తలందరూ అంగీకరిస్తారు. "హెచ్చు జీతా లివ్వడమంటే తక్కువ లాభాలు వస్తాయన్నమాట," అని వాదించే వారితో వారు సమ్మతించక, "జీతాలు పెరిగితే లాభాలు పెరుగుతాయి ; అవి తగ్గితే ఇవి తగ్గుతాయి," అనే వాదానికి సమ్మతిస్తారు.

పైకి కనిపించని పోటీ

అమెరికా ఆర్థిక వ్యవస్థ గురించి చాలా హెచ్చుగా జరుగుతున్న విమర్శాచర్చలు, బహుశా దానిలో వున్న పోటీ తత్వం గురించి జరుగుతున్నాయి. పోటీ పడడం ముఖ్యమైనదనీ, అమెరికన్ విధానంలో అది తగినంతగా లేదనీ, ఇప్పుడది కనీసం పూర్వం వున్నంతగాకూడా లేదనీ అమెరికనులు నమ్ముతున్నట్టు కనిపిస్తుంది. పోటీ తత్వం నశించి పోతుందనీ, అమెరికాలో మిగిలే కాపిటలిజం బ్రిటన్, జర్మనీలలోవున్న దానికి భిన్నంగా వుండదనీ అనేకమంది అమెరికనులు విచారపడుతున్నారు. బ్రిటన్, జర్మనీలలో కాపిటలిజం ఈ శతాబ్దారంభానికే గుత్త వ్యాపారంగా (మొనాపలీ) తయారైంది. అందుచేత, వ్యాపారలాభమే పరమాశయంగా వుండే నూతన వ్యాపారలాభ విధానానికి ఆ దేశాలలో వున్న ఆర్థిక విధానం మార్గం చేస్తూంది. అమెరికా ఆర్థిక విధానంలోని వివిధ అంశాలను విడివిడిగా పరిశీలించినట్లయితే, దానిలో పోటీ లేదనీ, లేదా స్వల్పంగా వున్నదనీ చక్కగా బోధపడుతుంది: అట్లాంటిక్ అండ్ పసిఫిక్ టీ కంపెనీవారి బ్రాంచి వొకటి ఒక గ్రామంలో వున్నదంటే, మరొక టీ షాపు దానితో పోటీ చెయ్యలేదు; రెండు ప్రాంతాల మధ్య ఒక రైలు మార్గాన్ని నడుపుతున్న కంపెనీ వుంటే, అక్కడ మరొక కంపెనీ రైలు మార్గాన్ని నిర్మించలేదు; డ్యు పాంట్ ప్యాక్టరీవారు నైలాన్ ఉత్పత్తి చేస్తున్నారంటే, అంత చక్కగా మరొకరు ఉత్పత్తి చెయ్యలేరు. ఈ విధంగా ప్రతి ఒక అంగమూ గుత్తవ్యాపారంలాగ వుంటే, మొత్తం అన్నీ కలిసినటువంటిది గుత్త వ్యాపార వ్యవస్థ కాక మరేమవుతుంది?

పోటీ పని చేస్తున్నస్థాయి

దీనిలో సూక్ష్మ విషయమేమిటంటే, ఈ వ్యవస్థ కేవలం వివిధ అంగాల కలయిక మాత్రమేకాక, వాటికి పరస్పర సంబంధం కూడా వున్న వ్యవస్థకావడం. పోటీ అనేది ఏ ఒక దానిలోనూ వుండదు. పరస్పర సంబంధంగల అంగాలు వున్న విధానంలో వుంటుంది అది. అమెరికా పారిశ్రామికరంగంలో ఉపాంగాలుగా వున్న కోటి యూనిట్‌లలో ప్రతి వొకటీ గుత్తవ్యాపారమే అన్నప్పటికీ కూడా (అలాగ లేదు లెండి) ఉత్పత్తి, శ్రమ, వినియోగం, ప్రభుత్వం మొదలైన వీటన్నింటితో వాటికి గల సమస్త సంబంధాలను యోచించవలసి



అమెరికా ఆర్థిక విధానం ఉత్తమంగా వుండడానికి కీలకపాత్ర వహిస్తున్నవారు విక్రేతలు. విక్రేతల సంఖ్య హెచ్చుతున్నది కనుక సరకులను హెచ్చుగా తయారు చేయడంవలన లాభాలు అధికంగా వస్తాయని అమెరికన్ వ్యాపారస్తులు చాలాకాలం క్రిందటే గ్రహించారు.

వుంటుంది. "American Capitalism, The concept of Countervailing power" అనే పుస్తకాన్ని రచించిన ప్రొఫెసర్ గాల్‌బ్రయిత్ మొదటిపేజీలో ఇలా వ్రాశాడు : "అమెరికా ఆర్థిక రంగం యొక్క ప్రస్తుత నిర్మాణం, దాని నిర్వహణ....నిబంధనలకు వ్యతిరేకమైనవి .... అయినప్పటికీ అది పని చేస్తుంది." యథార్థమేమిటంటే, నిబంధనలైతే వున్నాయిగాని, అవి పని చేస్తున్న పథకం ఏకీఏకి పరిశ్రమల పథకాలకంటే క్లిష్టమైనది. గుత్త వ్యాపారం చేస్తున్న పెద్ద పరిశ్రమలు మొదిలైనవి వున్నమాట నిజం ; ఇవి వున్నప్పటికీ పోటీ పడడం వుంది ; వ్యాపార సరళి చక్కగా సాగడానికి అవకాశం వుంది ; కొత్త పరిశ్రమలకు, కొత్త పరిశోధనలకు తావు వుంది. ఒక వూళ్ళో వున్న ఒక సరకుల షాపు మరొక దానితో పోటీ చేస్తుంది ; విమానాలు, బస్సులు రైళ్ళతో పోటీ చేస్తాయి ; ఒక హోటలు మరొక హోటలుతో పోటీ చేస్తుంది ; రేడియోలు వార్తా పత్రికలతో, ప్లాస్టిక్ సరకులు లోహపు సరకులతో, కార్మికులు వ్యాపారస్తులతో—ఈ విధంగా పోటీ జరుగుతూంది. నిజం చెప్పాలంటే 1956 లో 40,000 కోట్ల డాలర్ల వ్యాపారం జరిగిన అమెరికన్ ఆర్థిక వ్యవస్థలో వున్నంత పోటీ, 27 సంవత్సరాలక్రిందట 10,300 కోట్ల డాలర్ల వ్యాపారం జరిగిన నాడు లేదు.

వ్యాపారంలో మార్పులు

మొత్తంమీద అమెరికా ఆర్థిక విధానంలో పోటీ అనేది ప్రధాన లక్షణంగా లేకపోతే, వ్యాపార సౌలభ్యం ఇప్పటి కంటె చాలా తక్కువగా వుండేది. సగటున ఒక సంవత్సరంలో పది పన్నెండుకి వ్యాపారాలలో ఒక వ్యాపారంచొప్పున విరమించబడుతూ వుంటాయి. వ్యాపారాలు జరుగుతున్న వాటిలో ఎనిమిదింటిలోనో, పదింటిలోనో ఒకటి చొప్పున కొత్త వ్యాపారాలు వెలుస్తూ వుంటాయి. దివాళా తీసే వ్యాపారాలు బహు తక్కువ. ఇటీవలి సంవత్సరాలలో ఇవి సుమారు నూటికి ఒకటినుంచి మూడు వరకు వున్నాయి. దేనిలోనైనా పెట్టుబడి పెట్టిన ధనానికి మితిమీరిన నష్టం రాదు. ఎందుకంటే, చాలా వ్యాపారాలను విషమ స్థితికి రాకుండానే విరమిస్తారు. వ్యాపారాన్ని విరమిస్తే, మిగిలిన సరకులను అమ్ముకోగా వచ్చిన ధనాన్ని ఇతర వ్యాపారాలకోసం పెట్టుబడి పెట్టుకుంటారు. ఒక ప్లాను ప్రకారం నిర్మించుకున్న ఆర్థిక వ్యవస్థలో ఇటువంటి విషయాలవల్ల సంభవించే నష్టం కంటె, అమెరికాలో ఈ విధంగా సంభవించే నష్టం

తక్కువ అని అమెరికనుల విశ్వాసం. ఎందుచేతనంటే, ప్లాను ప్రకారం నిర్మించబడిన ఆర్థిక వ్యవస్థయొక్క ప్లానింగులో లోపాలు వుంటాయి; వ్యాపారాలు వృద్ధికాకుండా అవి నలిమివేస్తాయి. పోటీ విధానంయొక్క ప్రభావం ముఖ్యంగా చిన్న వ్యాపారాలమీద కనిపిస్తుంది; ఏమైనా, అనేకమంది వ్యాపారస్తులు నిరంతరం అప్రమత్తతగా వుండవలసినంత పోటీవుంది— బాధలతోపాటు ప్రయోజనాలు కూడా వున్న పోటీ ఇది.

ఆర్థిక విధానాన్ని ఉన్నతస్థాయిలో వుంచేది పోటీ

సాంఘిక భద్రతకోసం ఫెడరల్, స్టేట్ ప్రభుత్వాల స్కీములు, ప్రయివేటు స్కీములు వుండనే వున్నాయి గనుక, పోటీవల్ల ఏ కంపెనీ అయినా మూసివేయబడితే ఉద్యోగాలు పోయినవారు ఈనాడు అట్టే బాధపడ వలసింది లేదు. పైగా, అందువల్ల ఎక్కువ బాధపడేవారు దానిలో ధనం పెట్టినవారు. పోటీ విధానంవల్ల కొత్త పరిశ్రమలు వెలుస్తాయి; పనికిరాని చెత్త పరిశ్రమలు లెక్కకు మించకుండా చేస్తుందది; సాంకేతికంగా నూతన విషయాలను విధిగా కనుగొనేటట్లు చేస్తుంది; అసమర్థనీయమైన పరిశ్రమలు, పనికిరాని పరిశ్రమలు గతించేటట్లు చేసి, పారిశ్రామిక రంగాన్ని చక్కబరుస్తుంది. కొంతకాలం క్రిందట అమెరికనులు "వస్తువు ఒకటికి స్వల్పలాభం పొందుతూ ఎక్కువ యంత్రాలమీద ఎక్కువ వస్తువులను ఉత్పత్తిచేస్తే వచ్చే లాభం ఎక్కువగా వుంటుంది. వస్తువు ఒకటికి ఎక్కువ లాభంపొందుతూ కొలది వస్తువులను ఉత్పత్తిచేస్తే వచ్చే లాభం కొలదిగా వుంటుంది" అని కనిపెట్టారు. పెట్టుబడి పెట్టిన ధనం ఎంత హెచ్చుగా వ్యాపారంలో తిరుగుతూవుంటే, స్వల్ప స్వల్పంగా వచ్చే లాభాలన్నీకలిపి అంత పెద్ద మొత్తమవుతుంది గనుక, ఇది అతి చక్కనిపద్ధతి అని వారు తెలుసుకున్నారు. తదితర విధానాలతోపాటు ఈ విధానాన్ని కూడా అనుసరించడంవలన, వస్తువులను హెచ్చుధరలకు అమ్మే నిమిత్తం వాటిని పరిమితంగా ఉత్పత్తి చేదామని పారిశ్రామిక వేత్తలు తలపోసేవారు కాదు. దాని ఫలితమేమంటే, మొత్తంమీద అమెరికన్ వ్యాపారరంగం కొనుగోలుదారులకు తగినంత ప్రయోజన కరమైంది; హెచ్చుగా ధనం వ్యాపారాలలో తిరగడం, స్వల్ప స్వల్పంగా లాభాలు రావడం జరిగింది. యూరప్ పారిశ్రామికరంగంలో తాజాగా జరిగినది దీనికి కేవలం భిన్నం. అమెరికాలో అనేక పెద్ద కంపె

నీలు పెట్టిన పెట్టుబడి ధనానికి హెచ్చుగా లాభాలు వచ్చివుండవచ్చుగానీ, అవి అమ్మిన సరకులమీద డాలరు వొకటికి ఒకటి రెండు సెంటులకంటె ఎక్కువలాభం రాలేదు: ఏ సంవత్సరంలో చూచినాసరే, ఆహార పదార్థాలు అమ్మే అనేకషాపులు నడుపుతున్న కంపెనీలు డాలరు వొకటికీ ఒకసెంటు లాభం తీస్తాయో లేదో; మాంసం డబ్బాలు తయారుచేసి అమ్మే పారిశ్రామికులు ఇంకా తక్కువలాభం తీస్తారు.

భారీతనాన్ని అరికట్టేది పోటీ

ఒక్కొక్క అమెరికన్ వ్యాపారం "కొండంత" వుండడం దుర్లక్షణాలలో వొకటని భావిస్తూ వుంటారు కొందరు. అమెరికన్ పరిశ్రమలలో ఇటువంటివి చాలాతక్కువ. ఏమైనా, అన్నిటికంటె పెద్దదైన ఒక పరిశ్రమలో షేర్లువున్న సొంతగాళ్ళు అయిదులక్షలమందికి పైగా వున్నారు; అయినప్పటికీ, ఈ పరిశ్రమను మొత్తం అమెరికన్ పరిశ్రమలతో పోల్చిచూస్తే చాలాచిన్నది. అమెరికాలోనూ, ఏదో వొక విదేశంలోనూ వున్న ఒకేరకం పరిశ్రమను పోల్చి చూచినట్లయితే అమెరికాలో వున్నది చిన్నదై వుంటుంది; అయినప్పటికీ అది విదేశీయుల కళ్ళకు బ్రహ్మాండమైన పరిశ్రమగా కనిపించవచ్చు; తీరాచేసి, దానిని మొత్తం అమెరికన్ పరిశ్రమలతో పోలిస్తే చిన్నదై వుంటుంది. అమెరికాలో మొత్తం పరిశ్రమలదృష్ట్యా పెద్ద పరిశ్రమల ప్రాముఖ్యం తగ్గిపోతున్నదని అనేకమంది ఆర్థికశాస్త్రవేత్తలు చెబుతున్నారు. మధ్యప్రమాణంగల పరిశ్రమలను ఎక్కువ నెలకొల్పాలని ప్రస్తుతంలో అమెరికా ధోరణిగా కనిపిస్తూంది. ఈ ధోరణి రావడానికిగల కారణాలలో ఒకటి పోటీతత్వం. ప్రతి డాలరుమీద వచ్చేలాభం స్వల్పంగనుక, నష్టం రాకుండా చూచుకోవాలి; లాభం వచ్చేటట్లు పరిశ్రమను నెలకొల్పుకోవాలి. పరిశ్రమ మితిమీరి పెరిగిపోయినట్లయితే, దానిని నిర్వహించడం క్లిష్టమై, నష్టం వస్తుంది. పోటీలేని గుత్త వ్యాపారానికి ఈ ప్రమాదంలేదు. ఎందుకంటే, ఖర్చులు పెరిగిపోతే, సరకుల ధరలు హెచ్చిస్తారు. అమెరికన్ విధానంలో ఏవొక పరిశ్రమ మితిమీరి పెరిగి పోకుండా చిన్న పరిశ్రమలు దానితో పోటీపడుతూ వుంటాయి. అవి దానికంటె హెచ్చు లాభాలు చేసుకోవచ్చు గనుక, యజమానులు ఆ పరిశ్రమను అదుపులో పెట్టుకుంటారు. కొన్ని పెద్ద అమెరికన్ పరిశ్రమలు కొంతకాలంగా తమ భారీ

స్వరూపంవల్ల బాధపడుతున్నాయి. "ఎంత పెద్దదైతే అంత మంచిది" అనే భావం చాలాభాగం తగ్గిపోయింది.

## ప్లానింగు, విద్య

అనేకరకాల ప్లానింగు కర్తలకు — అంటే సమష్టి విభిన్న పద్ధ
వాదం, వర్గప్రాబల్యవాదం, వ్యాపార లాభవాదం మొదలైన తిలో ప్లానింగు
వాటి భక్తులకు—అమెరికా విధానాన్ని విమర్శించడమంటే
సరదా; అమెరికా ఆర్థిక విధానంలో వున్న లోపాలకు కారణం దానికి ప్లానింగు లేకపోవడమేననీ, అందువల్ల అమెరికా ఆర్థికంగా మితిమీరిన ఒడుదుడుకులకు గురి అవుతూ వుంటుందనీ, ఆ కారణంగా అది ప్రపంచ సుస్థిరతకు ప్రమాద హేతువనీ వారు విమర్శిస్తారు. ఈ విమర్శకు సమాధానంగా రెండు అంశాలను తెల్పవచ్చు. ఒకజాతి కంతకూ వర్తించేప్లాను తయారు చేయడమంటే శాసనాలద్వారా ఆర్థిక వ్యవస్థను ఒక దిశగా నడిపించడమనీ, ఇదమిద్ధమైన లక్ష్యాల సాధనకు కృషిచేయడమనీ మనం అర్థం చేసుకోవాలి. దానిని అర్థంచేసుకుంటే, అమెరికాలో ప్లానింగు లేకపోలేదనీ, కాని ఇతర దేశాలు అనుసరించిన ప్లానింగులకంటె భిన్నమైనదానిని అది అనుసరించినదనీ తెలుస్తుంది. అమెరికన్ప్రజలు, లేదా వారిలో అధిక సంఖ్యాకులు ఆర్థిక స్వేచ్ఛ కావాలన్నారు. అందుచేత, అమెరికా కాంగ్రెసు అభీష్టానుసారం ప్రభుత్వ విధానాలు విస్పష్టంగా రూపొందించబడ్డాయి. విస్పష్టసూత్రాలమీద ఆధారపడిన ఆర్థిక వ్యవస్థను నెలకొల్పి, అది చక్కగా పనిచేసేటట్లు జాగ్రత్త వహించే విధానాలు అవి. సమష్టి ఆర్థికవిధానం మొదలైన ప్లానులను తయారుచెయ్యడానికి ఎన్ని తెలివితేటలు, ఎంత దూరదృష్టి వుండాలో, ఆర్థిక స్వేచ్ఛ వుండే ప్లానును తయారు చెయ్యడానికి కూడా అన్నీ వుండాలి. పొట్టునుంచి బియ్యాన్ని వేరుచెయ్యడానికి ఎవరైనా రెండింటిలో ఏదో ఒకపని చేస్తారు; పొట్టునుంచి బియ్యాన్నయినా విడదీయాలి; బియ్యంనుంచి పొట్టునైనా విడదీయాలి. ఈ రెండింటిలో ఏది చేసినా అది ఒక ప్లానుప్రకారం చేసిన పనే అవుతుంది. ఆర్థిక స్వేచ్ఛకోసం ప్లాను తయారుచేయడమంటే, ప్రతి ఆర్థిక అంగమూ తనకు తానే యథోచిత స్థానంలో వుండి పనిచేసే ఉద్యమాన్ని లేవదీయడమన్న మాట; ఆర్థిక

బానిసత్వానికి ప్లాను తయారుచేయడమంటే, ప్రతి అంగమూ ఏ స్థానంలో వుండడమో ప్రభుత్వమే నిర్ణయించడమన్న మాట. తమ విధానంవలన అత్యుత్తమ ఫలితాలు కలిగాయని అమెరికనులు, టర్గాట్, ఆడమ్ స్మిత్‌లలాగే విశ్వసిస్తున్నారు. వారి విధానం లోపభూయిష్టమైనదని వారి అనుభవంబట్టి గాని, ఇతరదేశాల అనుభవంబట్టిగాని దాఖలాలు కనిపించలేదు.

**వ్యాపారంలో ప్లానింగు వహించే పాత్ర**

అమెరికాలో ఆర్థిక వ్యవహారాలు జరిగే అంతస్థులో ప్లానింగు గురించికూడా ఎక్కువ శ్రద్ధ వహిస్తారు. మరుసటి దినానికో, మరుసటి వారానికో, మరుసటి నెలకో, మరుసటి సంవత్సరానికో, లేదా మరుసటి అయిదు సంవత్స రాలకో ప్లానులు వేసుకొనడం మేనేజర్లుచేసే ముఖ్య కార్యాలలో ఒకటి. మరుసటి సంవత్సరం చేసే పనులగురించి ప్లానులు వేసుకోడానికి వ్యాపారస్తులు చాలాకాలం దీర్ఘాలోచన చేస్తారు. ఇది ప్రతి సంవత్సరం జరుగుతుంది. సోవి యెట్ యూనియన్‌తోసహా బహుశా ఏ దేశంలోనూ ఇంత జాగ్రత్తగా ప్లానులు వేసుకోరు. మొత్తం అమెరికా ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన ప్లానును పభుత్వం తయారుచేస్తుందిగాని, ఆ తయారుచేయడం పరిమితంగా జరుగు తుంది. కాని, తమ వ్యాపారాలకు సంబంధించిన మిగతా అనేక ప్లానులను వ్యాపారస్తులు తయారు చేసుకుంటారు.

**ఉదార, వృత్తి విద్యలమీద శ్రద్ధ**

నిపుణులను తయారుచేయడానికి శిక్షణ యివ్వడం ఎంత అవసరమో, జాగ్రత్తగా ప్లానులు తయారు చేసు కొనడం అంత వసరం. అందుచేత, వ్యాపార ప్రపంచంలో విద్యకు ప్రాధాన్యం ఏర్పడింది. ఒకవ్యక్తి మేనేజరు పదవిలోకి రావాలంటే ఒక యూనివర్సిటీలోనో, కాలేజీలోనో పొందిన డిగ్రీ అంతకంతకు అత్యవసర మైంది. స్తోమతగల కంపెనీలన్నీ సుశిక్షితులైన ఆర్థిక శాస్త్రవేత్తలను, గణిత శాస్త్రవేత్తలను, ఇతర సాంఘిక శాస్త్రవేత్తలను నియోగిస్తాయి. అమెరికాలో ఇటువంటివారికి ప్రభుత్వంలోకంటె వీటిలో ఎక్కువ ఉద్యోగాలు లభిస్తాయి. అప్పుడే ఈ తరంలో, విద్యాగంధంలేని వ్యాపారస్తులు తక్కువ మంది వున్నారు; ముందు తరంలో అసలు వుండరు. వ్యాపారస్తుడు తన సంస్థను సంఘటితం చేసుకొనడం, ఉత్పత్తులు చెయ్యడం, అమ్మడం మొదలైన



విద్యాభివృద్ధి కొరకుగాని, వ్యాపారాలను కాపాడడం కొరకుగాని, లేదా పెద్దపెద్ద కంపెనీలను నిలబెట్టడం కొరకుగాని పథకాలు తయారుచెయ్యడానికి ఎంత మేధాశక్తి, ఎంత దూరదృష్టి అవసరమో, ఆర్థిక స్వేచ్ఛను కాపాడే పథకాన్ని తయారు చెయ్యడానికికూడా అవి అంతగా అవసరం.

విషయాలలో సమర్థుడవడం మాత్రమే కాదు; తన వ్యాపారానికి, లేదా అటువంటి వ్యాపారాల కన్నింటికీ మొత్తం సంఘంతో వున్న సంబంధాన్నీ, సంఘంలో ఒకరితో ఇంకొకరికి వున్న సంబంధాన్నీ చక్కగా గ్రహించగలిగి, అన్నీ తెలిసిన పౌరుడై వుంటాడు. వ్యాపారస్తులు విద్యావంతులై వుండాలని గుర్తించడం అమూల్యమైనదనీ, కొత్త పద్ధతిలో కాపిటలిజం వృద్ధిపొందడానికి వీరు మూలాధారులనీ కొందరు నమ్ముతారు.

సైన్సుపట్ల శ్రద్ధ

సాంకేతిక అభివృద్ధుల అవసరం వుందిగనుక శాస్త్రవేత్తలు అమూల్యమైన వారనే విషయాన్నికూడా గుర్తించాలి. అందుచేత శాస్త్రవేత్తలు తమ కృషిసాగించడానికి అవసరమైన "బౌద్ధిక స్వేచ్ఛ" ముఖ్యావసరం. సైన్సు విలువనుగాని, సాధ్యమైనన్ని విధాలా పరిశోధనలు జరపడం అవసరమనే విషయాన్నిగాని ఈనాడు అమెరికనులెవరూ శంకించరు. మానవ సమస్యలను, సాంకేతిక సమస్యలనుకూడా పరిష్కరించుకోడానికి పిడివాదంకాక విమర్శకాపూర్వకమైన శాస్త్రీయ పద్ధతి సముచితమైనదని అమెరికనులు నమ్ముతారు.

ఆర్థిక స్వేచ్ఛకు, తదితర స్వేచ్ఛకు మధ్య సంబంధం స్పష్టంగా ఎప్పుడూ లేదు

విద్యాబోధపట్ల వహించిన శ్రద్ధాసక్తులవల్ల కూడా అమెరికన్, యూరపియన్ కాపిటలిజాలలో ఇంకా తేడావచ్చింది. యూరప్, అమెరికాలలో రాజకీయస్వేచ్ఛవలన కాపిటలిజం వెలుగొందడం సాధ్యమైంది; స్వేచ్ఛావ్యవస్థలలో అది వృద్ధిపొందింది. ఏమైనా, అన్ని కార్యాలలో స్వేచ్ఛకు, సాంఘికవ్యవస్థకు ఎంత సన్నిహిత సంబంధంవుందో యూరపియన్ కాపిటలిస్టులు ఎప్పుడూ అర్థం చేసుకోలేదు. స్వేచ్ఛా వ్యాపారాన్ని, ఆస్తిపాస్తుల స్వేచ్ఛా వినియోగాన్ని స్వేచ్ఛా వ్యవస్థనుంచి ఎల్లకాలం వేరుపరచలేరని వారు గ్రహించలేదు; తమకు వెంటనే, ప్రత్యక్షంగా ఎంతవరకు బాధగా వుంటుందని మాత్రమే ప్రతి సమస్యను పరికించారు. యూరప్‌లోని చాలా దేశాలలో అనేకమంది వ్యాపారస్తులు ఫాసిజానికి, తత్సంబంధమైన ఉద్యమాలకు మద్దతు యివ్వడం వారికి వున్న అతి సంకుచిత బుద్ధివల్ల, అవివేకంవల్ల జరిగింది. ఫాసిజం ఇటలీ, జర్మనీలలో ఆర్థిక స్వేచ్ఛను అణచివేసింది. కాపిటలిజం పేరుతో ఫాసిజాన్ని బలపరచే వ్యాపారస్తుడు ఆత్మహత్య చేసు

కుంటున్నా డన్నమాట. అది ఎన్నటికీ స్వప్రయోజనం కాబోదు. యూరప్ లోని వ్యాపారస్తుడు సమ్మెలవల్ల, కార్మిక సంస్థలవల్ల, జీతాలు హెచ్చించాలనే కోరికలు మొదలైనవాటివల్ల బాధపడి విసుగెత్తిపోయాడు ; ఈ సమ్మెలు మొదలైనవన్నీ ఉదార ప్రజాస్వామ్యంవల్ల ఏర్పడడానికి అవకాశం కలిగింది. రాజకీయ సర్వాధికారానికి, ఆర్థిక స్వేచ్ఛకు పొత్తు కుదురుతుందని యూరపియన్ వ్యాపారస్తుడు నమ్మాడు; ఇందుకు పారెటో, పాంటలియోనీల వంటి ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్తల వాదాలు సహేతుకంగా కనిపించాయి. జర్మనీ, ఇటలీ, స్పెయిన్, పోలెండులలోనూ, కొంతవరకు ఫ్రాన్సులోనూ కూడా వ్యాపారస్తులలో మరీ హెచ్చుమంది ప్రజాస్వామ్యం మీద తిరగబడ్డారు.

**అమెరికాలో అది స్పష్టతరం**

యూరప్‌లోని వ్యాపారస్తులకంటె అమెరికన్ వ్యాపారస్తులు రాజకీయ స్వేచ్ఛకు, ఆర్థిక స్వేచ్ఛకు వున్న సరియైన సంబంధాన్ని చక్కగా గ్రహించారు. అమెరికాలో తీవ్ర కన్సర్వేటివులని భావించబడే కుడిపక్షపు రిపబ్లికనులు సయితం (కొలదిమంది తప్ప) అమెరికా రాజ్యాంగచట్టం ఇచ్చే ప్రజాస్వామ్యాన్ని గట్టిగా బలపరుస్తారు. ఇరవై అయిదు సంవత్సరాల క్రిందట బుద్ధిజీవులు మార్క్సిజం—లెనినిజం వ్యామోహంలో పడిపోతుండగా, కమ్యూనిస్టులు కార్మికోద్యమంలోకి చొచ్చుకు వస్తూవుండగా వారుమాత్రం ఫాసిస్టులు కాలేదు. ప్రజాస్వామ్యాన్ని నాశనంచేసి, భావిలో ప్రయివేటు ఆస్తులను రక్షించగలరనే వారిని వ్యాపారస్తులు మొత్తంగా బలపరచడం జరగలేదు. ఆ విధంగా యూరప్‌లో జరిగింది. డిక్టేటర్లను, కాబోయే డిక్టేటర్లనుకూడా అక్కడి వ్యాపారస్తులు బలపరచారు. చాలామంది అమెరికన్ వ్యాపారస్తులు విల్సన్ ప్రవేశపెట్టిన నూతన స్వేచ్ఛను, రూజ్వెల్టు యొక్క న్యూడీల్‌ను, ట్రూమన్‌యొక్క ఫెయిర్‌డీల్‌ను అసహ్యించుకున్నారు. అయినప్పటికీ, ప్రజాస్వామిక పద్ధతిలో తప్ప అన్యమార్గంలో వాటిని తాము ప్రతిఘటించాలనే ఆలోచనైనా వారికి కలగలేదు.

**విద్యాబోధ పాత్ర**

అన్నిరకాల విషయాలపట్ల అమెరికన్ వ్యాపారస్తులు నిస్సందేహంగా శ్రద్ధవహించారు. వారు ముఖ్యంగా శ్రద్ధవహించిన వాటిలో విద్యాబోధ ఒకటి. అందులోనూ, లిబరల్ ఆర్ట్స్ కాలేజీలలోని విద్యాబోధపట్ల వారు ఎక్కువశ్రద్ధ తీసు

కున్నారు. విద్యాభ్యాసంవల్ల వ్యాపారస్తునకు విశాలదృష్టి అలవడింది; తనకు వెంటనే ప్రయోజనం కలగడ మొకటే ప్రధానం కాదని అతడు తెలుసు కున్నాడు ; ఆర్థిక వ్యవస్థలోని క్లిష్ట సమస్యలు బోధపడ్డాయి ; అతడికి ఇటు వంటివి ఎన్నో తెలిశాయి. కాపిటలిజం మంచిదని గ్రహించాడు గనుక, అది నిలవడానికి అవకాశమిచ్చిన రాజ్యాంగ వ్యవస్థను అతడు ప్రతిఘటించ లేదు. ఇటువంటి వివేకం వున్నవాడు గనుకనే, కార్మికసమస్యలను ఎదుర్కో వలసి వచ్చినప్పుడు యూరపియన్ కాపిటలిస్టులాగ తరచు మంకుపట్టు పట్టడు. వ్యాపారస్తునకు జఫర్సన్‌తో "అతి పేద కార్మికుడు అతి గొప్ప ధన వంతునితో సమానహక్కు కలవాడు" అని చెప్పడానికి నోరు రాదుగాని ఇద్దరూ సమానహక్కు కలవారే ననిమాత్రం ఒప్పుకొనడం ఒప్పుకుంటాడు; గుత్త వ్యాపారం క్షేమంగావుండడం అతడికి ఇష్టమేగాని, అందువల్ల ఆ వ్యాపారానికే ముప్పు కలుగుతుందని చెప్పే స్మిత్ వాదంతో ఏకీభవిస్తాడు.

## లేబర్ యూనియనులు

వ్యాపారస్తులు పరిష్క- రించలేని సమస్యలు

ఆర్థిక స్వేచ్ఛ అంటే ఏమిటో, ఇతర రంగా లతో దానికివున్న సంబంధమేమిటో తెలిసిన అనేక మంది వ్యాపారస్తులు వుండడంవలన అమెరికాలో స్వేచ్ఛా వ్యాపార సరళి చక్కని స్థితికి వచ్చింది. ఏమైనా, ఒక్క వ్యాపారస్తుల ఇష్టప్రకారమే జరిగేటట్లయితే ఆర్థిక స్వేచ్ఛ అంతరిస్తుంది; వ్యాపారస్తులు పరిష్క రించలేని సమస్యలలో రెండు పెద్ద సమస్యలున్నాయి : వాటిలో ఒకటి, వారు ఉత్పత్తిచేసిన సరకులు విడుదలయేటట్లు చెయ్యడమెలాగ అనే సమస్య; రెండవది నిరుద్యోగ సమస్య. లాభం సంపాదించుకొనడం వ్యాపారస్తుడు చెయ్యవలసిన పని; లాభం సంపాదించుకున్నాడంటే మంచిదే; లాభాలు మరీ హెచ్చుగా వచ్చినప్పటికీ దానిలోని పనివారికి (అంటే, కొనుగోలుదారు లైన ప్రజలకు) భాగంగా వచ్చే ధనం పరిశ్రమలలో తయారయే సరకులను కొనడానికి చాలదు (వ్యాపారస్తులు హెచ్చులాభాలు తీయకుండా వుందామని అనుకోవచ్చును లెండి; ఆకలితో వున్నవాడు అన్నం తినకుండా వుండడం ఎంత కష్టమో, లాభాలను తగ్గించుకుందామని అనుకొనడంకూడా అంతకష్టం). ఉత్పత్తుల ఖర్చులను తగ్గించడానికీ, పోటీలో లాభసాటిగా

వుండడానికీ అతి సులభమైన పద్ధతి పనివారి సంఖ్యను తగ్గించడం. దాని ఫలితంగా అనేక యూరపియన్ దేశాలను నిరంతరం పీడిస్తున్న నిరుద్యోగ సమస్య వస్తుంది. వ్యాపారస్తులు కానివారు జోక్యం కలిగించుకొనడం వలన మాత్రమే, కాపిటలిస్టు విధానంలోవున్న ఈ రెండు ప్రధాన లోపాలను సవరించవచ్చు. అమెరికాలో కాపిటలిజంయొక్క లోపాలను సవరించి, అది వృద్ధికి రావడానికి సహాయపడినవారు కార్మికులూ, ప్రభుత్వాధి కారులూను.

అమెరికా యూరప్‌లలోని వ్యాపారస్తులకు ఎంత వ్యత్యాసంవుందో కార్మికులకు కూడా అంత వ్యత్యాసం వుంది—బహుశా ఇంకా ఎక్కువే వుంది. సంఘటిత కార్మిక సంఘాల ప్రాముఖ్యం కార్మికులకు యూరప్‌లో ఎంత ప్రధానపాత్ర వుందో అమెరికాలో కూడా అంతగావుంది ; యూరప్‌లోకంటె ఎక్కువ కాలంనుంచి వుందికూడా. జాక్సన్‌ను 1828 లోను, 1832 లోను ప్రతిఘటించిన కన్సర్వేటివ్‌లను ఓడించ డానికి కార్మికులు కారకులు ; కార్మికుల ఆందోళన ఫలితంగా డెమోక్రాట్‌లు, రిపబ్లికనులు 1880—1900 మధ్య ఆర్థిక, సాంఘిక సంస్కరణలు చెయ్యక తప్పిందికాదు; రూజ్వెల్టును 1932 లో ఎన్నుకున్నవారు కార్మికులు. ఈనాడు అమెరికాలో సంఘటిత కార్మికులు 180 లక్షలమంది వున్నారు. కార్మికులు బలంలోను, పలుకుబడిలోను పారిశ్రామికులు, బ్యాంకర్లు, వాణిజ్యమండలులు, రైతులు మొదలగువారితో సమానంగా వున్నారు.

19 వ శతాబ్దంలో చాలాకాలంపాటు అమెరికాలో అమెరికన్ కార్మికులు సంఘటిత కార్మికులు తమ రాజకీయాల, విధానాల విష సోషలిస్టులు కారు యంలో యూరపియన్ కార్మికులంత సందిగ్ధంగా వున్నారు. బహుశా యూరపియన్ కార్మికులు అనుసరించిన విధానాల నన్నింటినీ అమెరికన్ కార్మికులు ఎప్పుడో ఒకప్పుడు అనుసరించిన వారే. నైట్స్ ఆఫ్ లేబర్ సంఘంవారు, ప్రపంచ పారిశ్రామిక కార్మిక సంఘంవారు కూడా యూరపియన్ కార్మికులంత తీవ్ర ధోరణి వహించినవారు. అంతర్జాతీయ కార్మిక సమావేశం జరపడానికి ఏ యూరపియన్ నగరంకంటె కూడా న్యూయార్కు నగరం ఉత్తమంగా వుంటుందని 1872 లో మార్క్స్ నిశ్చయించాడు. కాని, 1876 నాటికి ఏర్పడిన "ఇనుము, ఉక్కు కార్మిక

సంఘాల మండలి" వారు తమ మండలి నియమావళిని తయారుచేసుకొని "పనివారంటూ వున్న వ్యాపారా లన్నింటినీ మనం కాపాడాలి" అని తమ సభ్యులను హెచ్చరించారు. అమెరికాలో 19 వ శతాబ్దం చివరి రోజులనుంచీ అతి బలీయమై, మిక్కిలి పలుకుబడిగల కార్మికసంఘం "అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్". ఈ ఫెడరేషనువారు సమష్టివాదాన్నిగాని, పరిశ్రమలను జాతీయం చెయ్యాలనే వాదాన్నిగాని, మొత్తం అన్నిటికీ ప్రభుత్వమే పథకాలు తయారుచెయ్యాలనే వాదాన్నిగాని, తదితర సోషలిస్టు వాదలనుగాని ఒప్పుకోలేదు. స్వేచ్ఛా వ్యాపారంలో వున్న లోపాలను సరిదిద్దడం, కార్మికులకు ఆర్థిక క్షేమం కలిగించడం, వ్యాపార లాభాలలో పనివారికి వచ్చే భాగాన్ని హెచ్చింపచేయడం, కార్మికుల శ్రమ పరిస్థితులను చక్క బరచడం—ఇవన్నీ కార్మికుల ఫెడరేషన్ యొక్క ఆశయాలు. తగినంతగా స్వేచ్ఛా వ్యాపార సరళి వుండే వ్యవస్థలో వాటిని సాధించాలని ఫెడరేషన్ ఆశయం. పారిశ్రామిక కార్మిక సంఘాల కాంగ్రెసు (కాంగ్రెస్ ఆఫ్ ఇండస్ట్రియల్ ఆర్గనైజేషన్) అనేది 1935 లో ఏర్పడింది. అది 1955 లో పైన తెల్పిన ఫెడరేషన్‌తో విలీనమైంది. అవి రెండూ కలిసి అఖిల కార్మిక మండలి అయింది. కార్మిక సంఘాల కాంగ్రెసు ఏర్పడిన ఆదిలో ఒక బలీయ సోషలిస్టు వర్గం ఉండేది. అయితే, అది గత పది సంవత్సరాలలో చాలా బలహీనమైపోయింది. ఈ నాడు అఖిల కార్మిక మండలి, రైల్వే కార్మికుల సోదర సమితి, ఇంకా ఇతర స్వతంత్ర యూనియనులు స్వేచ్ఛా వ్యాపార విధానపు లోపాలను సవరించు కోవాలని స్పష్టంగా చెబుతున్నాయి ; దానిని ఏనాటికైనా నాశనం చెయ్యాలనే తలంపుకూడా లేదు వాటికి.

రెండు పెద్ద కార్మిక సంఘాలు

అఖిల కార్మిక మండలిలో (ఫెడరేషను, కాంగ్రెసు విలీనమైనది) అమెరికా అంతటా వున్న సంఘటిత కార్మికులలో పదింట తొమ్మిది వంతులమంది వున్నారు. 1955 చివరి రోజులలో ప్రెసిడెంటు మీనీ ఈ మండలిగురించి తన ప్రకటనలలో విస్పష్టం చేసినవి మూడు విషయాలున్నాయి. వాటికి యూరపియన్ కార్మిక నాయకులలో ఎప్పటికైనా సమ్మతించేవారు వుంటే ఏ కొద్ది మందో వుండవచ్చునేమో ; ఆయన చెప్పిన విషయాలివి : (1) కార్మికుల ప్రయోజనాలు, మేనేజిమెంటు ప్రయోజనాలు పరస్పరం ఆధారపడ్డవి ; (2) స్వేచ్ఛా



అమెరికాలో సంఘాలుగా ఏర్పడిన కార్మికులు 160 లక్షలమంది వున్నారు; అంటే, అన్నింకాల వృత్తులలో వున్నవారిసంఖ్యలో వీరిసంఖ్య మూడవవంతు వుంది; మొత్తం కార్మికుల సంఖ్యలో ఇది నాలుగవ వంతువుంది; బ్రిటిష్ ప్రజల జాతీయ ఆదాయంకంటె ఈ సంఘటిత కార్మికులకు నూటికి 50 వంతులు ఎక్కువగా జీతాలరూపంలో వస్తుంది.

వ్యాపారంలాగే, స్వేచ్ఛా ప్రభుత్వంలో మాత్రమే స్వేచ్ఛా కార్మికులు మనగలరు ; (3) ప్రభుత్వం కంట్రోలును అన్నింటికీ వర్తింప చేయడానికి అమెరికన్ కార్మికులు సమ్మతించరు ; కార్మిక వర్గం తన కోరికలను సాధించడానికి సమష్టిగా బేరమాడుకొనే విధానంమీద అది ఆధారపడు తుంది. అమెరికాలో అన్ని రకాల ఉద్యోగాల సంఖ్యతో పోల్చినట్లయితే సంఘాలుగా ఏర్పడ్డ కార్మికులు మూడవ వంతు మంది వున్నారు. ఇటువంటి కార్మికులు 160 లక్షల మంది ; వీరు మొత్తం కార్మికులలో నాలుగో వంతు మంది. వీరికి జీతాల రూపంలో వచ్చే ఆదాయం బ్రిటిష్ ప్రజల జాతీయ ఆదాయం కంటె నూటికి 50 వంతులు హెచ్చు; ఏ యితర వర్గం కంటె కూడా వీరికి ఎక్కువ పలుకుబడి వుంది ; ఎన్నికలలో వీరు ఏ పార్టీని నెగ్గించాలంటే ఆ పార్టీని నెగ్గించనూగలరు ; వీరు జనరల్ మోటార్స్, యు. ఎస్. స్టీల్, స్టాండర్డు ఆయిల్ మొదలగు బ్రహ్మాండమైన కంపెనీలను పడిపోకుండా నిలబెట్టనూగలరు. ఈ నాడు ఆర్థిక స్వేచ్ఛకు వరప్రసాదంగా వున్న ఆర్థిక వ్యవస్థలో ఎగుడు దిగుడులు రాకుండా చేయాలంటే వీరి పాత్ర అతి ముఖ్య మైనది. "కార్మికులు తమకు స్థిరత్వం లేదనీ, బ్రతుకే భయావహంగా ఉన్నదనీ తలపోస్తే ప్రపంచానికి క్షేమం లేదు" అని మెండెస్—ఫ్రాన్సు చెప్పిన అభిప్రాయం సరియైనదని అంగీకరించేటట్లయితే, అఖిల అమెరికా కార్మికమండలి అమెరికా క్షేమానికీ, దానితో సంబంధంవున్న దేశాల క్షేమానికీ వెన్నెముక వంటిదని చెప్పాలి. ఎందుకంటే, ఈ మండలి అమెరికా కార్మికులకు స్థిరత్వం యిచ్చింది ; వారి భయాందోళనలను పారద్రోలింది.

**అనుభవంవల్ల గ్రహింపు**

అమెరికన్ కార్మికులవైఖరి, కాపిటలిస్టుల ఒత్తిడివల్ల పుట్టినదని యూరపియన్ సోషలిస్టులు తరచు విమర్శిస్తూ వుంటారు. నిజం అది కాదు. యూరపియన్ వ్యాపారస్తునికి వున్నమంకుపట్టు అమెరికన్ వ్యాపారస్తునికి ఏ విధంగా లేదో, అమెరికన్ కార్మిక నాయకులకు కూడా లేదు. వీరు అనుసరించే సూత్రాలు స్వానుభవజనితమైనవిగాని, పరమ సత్యాన్ని వెల్లడిస్తాయనుకొనే పుస్తకాలను చదవడంవల్ల వచ్చినవికావు. వీరు యూరపియన్ కార్మిక నాయకులకంటె తరచుగా ఎక్కువ అనుభవజ్ఞులు. కార్మికుల క్షేమం వీరి లక్ష్యం గనుక, తమ దేశంలో నిజంగా ఏమి జరిగినదీ

ఇతర దేశాలలో ఏమి జరిగినదీ గమనిస్తారు. అంతేగాని, ఇదివరలో కార్మికుల కాంగ్రెసు ప్రెసిడెంటు, ఇప్పటి మండలి వైస్ ప్రెసిడెంటు అయిన రూథర్ చేసినట్టు చాలామంది చేయలేరు; ఆయన ఇంగ్లండుకు, యూరప్‌కు, సోవియెట్ యూనియనుకు వెళ్ళి, వాటిలో పని చేసి వచ్చాడు. విదేశాలకు వెళ్ళి అక్కడి పరిస్థితులను స్వయంగా చూచి రావడానికి ఆయన లాగ అవకాశం లేనివారు సాధ్యమైనంత యథార్థసమాచారాన్ని సేకరించడానికి ప్రయత్నిస్తారు. కార్మికులు తమ విధానాలను నిర్ణయించే బాధ్యత అంతకంతకు ఎక్కువగా మంచి విద్యాధికులైనవారి చేతుల్లో పెడుతున్నారు; ఆర్థిక శాస్త్ర పారంగతుల అభిప్రాయాలను అడిగి, వారు చెప్పినది వింటారు. ఆర్థిక రాజకీయ వాస్తవాలను జాగ్రత్తగా పరిశీలించిన మీదట తమ విధానాలను నిర్ణయించుకుంటారు. వీటన్నింటి ఫలితంగా, కాపిటలిజాన్ని పూర్తిగా విడనాడడం మంచిదికాదని కార్మికులకు నమ్మకం కుదిరింది; ప్రభుత్వపు కంట్రోలులో వుండే ఆర్థిక వ్యవస్థలోకంటె స్వేచ్ఛా వాతావరణంగల దేశంలో తమ అభివృద్ధికి అవకాశాలున్నాయని వారికి ఇదివరకే వున్న అభిప్రాయం బలపడింది. ఉత్తమ జీవనానికి పోరాటం జరిపే ఈ కార్మికులు, కాపిటలిస్టు విధానాన్ని నిలబెట్టడానికే పోరాటం జరుపుతారుగాని, దానిని త్రోసిరాజు చేయడానికి కాదు.

### అమెరికన్ కార్మికోద్యమంలో లోపం

అమెరికన్ కార్మికోద్యమంలో అవినీతి, దౌర్జన్యం, నిరంకుశాధికారం హెచ్చుగా ఉన్నాయని తరచు విమర్శిస్తూంటారు. అయితే, ఈ విమర్శను పూర్తిగా కొట్టివేయడానికి వల్లకాదుగాని, దీనిలో అతిశయోక్తి ఉన్నదనిమాత్రం చెప్పాలి. ఎలాగంటే, వాల్‌పోల్‌కాలంలో ఇంగ్లండు రాజకీయ రంగంలో అవినీతి ఉన్నది. లూయీ ఫిలిప్‌కాలంలో ఫ్రాన్సులో అవినీతి ఉన్నది. అంత మాత్రం చేత, ఆ దేశాలలో రాజ్యాంగ విధానం, రాజకీయ స్వేచ్ఛ ఎంత అభివృద్ధి చెందాయో మరచిపోరాదు. అదేవిధంగా, అమెరికన్ కార్మికోద్యమంలో లోపాలు కనిపిస్తున్నాయనే సాకుతో అది సాధించిన విజయాలను, అమెరికన్ సంస్థల పాటవానికి అది చేసిన దోహదాన్ని మరచిపోకూడదు. కార్మికసంఘాలన్నీ కార్మికుల సంక్షేమ సౌభాగ్యాలను కాంక్షిస్తాయి; కాని,

సమష్టివాదానికి, వర్గ ప్రాబల్య వాదానికి సమ్మతించవు; అందుచేత, అవి ఒక నూతన స్థానాన్ని సృష్టించుకొని, నూతన విధానాన్ని రూపొందించుకున్నవి. ఇది అమెరికన్ కార్మికులు సాధించిన గొప్ప విజయం.

## ప్రభుత్వ పాత్ర

ప్రభుత్వ పాత్ర: సూత్రాలు

అమెరికా, యూరప్‌ల వ్యాపారాలు, కార్మిక సంఘాలు తేడాగా ఉన్నట్లే ప్రభుత్వాల చర్యలుకూడా తేడాగా ఉంటాయి. అమెరికాలో ఫెడరల్, స్టేట్ ప్రభుత్వాల విధానాలు 1776 నాటి స్వాతంత్ర్య ప్రకటనలోని రెండవ పేరా మీద ఆధార పడినట్టివి. ఆ రెండవ పేరాలో ఉన్నదిది: "ప్రజలు జీవించ డానికి, స్వేచ్ఛ ననుభవించడానికి, వారు సౌఖ్యాన్వేషణ చేసుకోడానికి ప్రభుత్వాలు ఏర్పడ్డాయి." ఇదే విషయం అమెరికా రాజ్యాంగ చట్టం యొక్క ఉపోద్ఘాతంలో కూడా వుంది. ఈ సూత్రం ప్రకారం ఫెడరల్, స్టేట్ ప్రభుత్వాలు చర్యలు తీసుకొనేటట్లు చెయ్యడానికి తగినంతమంది అమెరికనులు దీనిని దృష్టిలో ఉంచుకొంటూ వుంటారు. గత 180 సంవత్సరాలలో జరిగిన శాసనాలకు ఈ సూత్రమే ఆధారంగా వుంది. అయితే, పైపైన చూచేవానికి ఈ విషయం అంతగా బోధపడక పోవచ్చు. అమెరికన్ రిపబ్లిక్‌ను ప్రజలు మనసారా నెలకొల్పుకొన్నారు; తమ రాజ్యాంగ చట్టాన్ని ఫలప్రదంగా ఆచ రించుకొంటూ ఉండాలంటే, తమ నూతన అనుభవాల దృష్ట్యా దానిని నిరంతరమూ పునః ప్రకటన చేస్తూ, పునః వ్యాఖ్యానంచేస్తూ ఉండడం అవసర మని అమెరికనులలో అత్యధిక సంఖ్యాకులకు స్పష్టంగా తెలుసు. ఇదే విధంగా అమెరికా ఆర్థిక విధానంలో కూడా జరిగింది; ఆర్థిక స్వేచ్ఛను ప్రజలు మనసారా ఏర్పరచుకొన్నారు. ఆర్థిక స్వేచ్ఛ వర్ధిల్లుతూ ఉండాలంటే, దానిని పునఃప్రకటన చేస్తూండడం మాత్రమేకాక, అది ఏర్పడడానికి కీలకమైన సూత్రా లను పునః వ్యాఖ్యానించుకోడానికి శాసనాలు చెయ్యడం కూడా అవసరం.

వ్యాపార రక్షణనుంచి గుత్త వర్తకంమీద ధాడివరకు మార్పు

అమెరికా వ్యాపారంమీద విదేశాలనుంచి ఆర్థికంగా ఒత్తిడి జరగకుండా దానిని కాపాడడానికి మాత్రమే ప్రభుత్వం మొదట్లో శ్రద్ధ వహించింది. స్వేచ్ఛా వ్యాపార దృష్టితో చూచినా, ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక

విలీనీకరణ జరిగితే వివిధ దేశాలమధ్య విద్వేషాలు నశిస్తాయనే దృష్టితో చూచినా (ఇలాగ ఆశించినవారున్నారు) అమెరికా ప్రభుత్వ చర్య విచారకరమైనదే. కాని, ప్రభుత్వచర్యవల్ల అమెరికన్ కాపిటలిజం అసలు మార్గాలలో వృద్ధి కావడానికి వీలిచ్చింది. ఆ తరువాత దేశంలో గుత్తవ్యాపారం మీద జరిగిన పోరాటం పట్ల కూడా ప్రభుత్వం శ్రద్ధ వహించింది : ముఖ్యంగా, అంతర్యుద్ధానికి పూర్వమూ దాని తరువాతనూ కూడా ధనికులు పారిశ్రామిక వేత్తలు బలపడకుండా చర్యలు తీసుకొన్నది. అన్ని ఆర్థిక విధానాలలోనూ గుత్త వ్యాపార లక్షణాలు సహజంగా వున్నాయి ; డిక్టేటర్లు రాజకీయ రంగంలో ఆశలు చూపడానికి ఈ గుత్త వ్యాపార విధానాన్ని అనుసరించి, తమరిని బలపరచేవారిని తద్విధంగా ఆకర్షించి, దేశాన్ని చటుక్కున పెడదారిలో పెడతారు. అమెరికాలో శాసనాలు చెయ్యడంద్వారాను, బ్యాంకులు మొదలైన వాటిని ఒక పద్ధతిలో పెట్టడం ద్వారాను, ఇంకా ఇటువంటి చర్యలద్వారాను గుత్తవ్యాపారంవున్న కంపెనీలమీద పోరాటాన్ని జరిపారు. ఈ పోరాటం సందర్భంగానే వాగ్నర్ చట్టాన్ని చేశారు. దీనిని అనుసరించి, ఆదాయం హెచ్చిన కొలదీ హెచ్చుపన్నులు విధించడం, మరణసుంకాలు విధించడం మొదలైనవి అమలులోకి వచ్చాయి. ఈ విధంగా, కొలదిమంది చేతులలో ధనం విపరీతంగా ప్రోగుపడకుండా నిరోధించారు.

ఆర్థిక విధానంలో కార్మికులూ మేనేజిమెంటూ, ప్రభుత్వ జోక్యం ఉత్పత్తిదారులూ వినియోగదారులూ, అప్పులిచ్చేవారూ సమస్థితికోసం పుచ్చుకొనేవారూ, పంటలూ పరిశ్రమలూ, ఇవన్నీ
అంగాలు. ఏదో ఒక అంగంపట్ల మితిమీరిన పక్షపాతం వుంటే (ఉదాహరణకు, వ్యాపార రంగమంతా తమ హస్తగతమై వుండాలని యూరపియన్ గుత్త వ్యాపారస్తులూ, అది కార్మికులచేతిలో వుండాలని అన్నిరకాల సోషలిస్టులూ ఆందోళన జరిపారు) ఆర్థికవ్యవస్థ ఊగిసలాడుతుంది; అప్పుడు వ్యాపారం సక్రమంగా జరగడానికి ప్రభుత్వం తప్పక చర్యలు తీసుకోవలసి వస్తుంది. ఈ వివిధ అంగాలు ఊగిసలాడకుండా ఆర్థిక వ్యవస్థను శక్తిమంతం

చెయ్యడానికి అమెరికా కాంగ్రెసు శాసనాలు చేస్తుంది; రాజకీయ వ్యవస్థలో వున్నట్లే, ఏ వొక అంగమూ మితిమీరిపోకుండా ఈ శాసనాలద్వారా అవరోధాలూ అనుకూలాలూ కల్పించబడుతూ వుంటాయి. ప్రతి ఆర్థిక అంగంలోనూ వచ్చే మార్పులవల్ల ఆర్థిక వ్యవస్థ సమంగా వుండక తారుమారుకావడం సదా జరుగుతూ వుంటుంది. రాజకీయ రంగంలోకంటె ఆర్థిక రంగంలో ఇది ఎక్కువ; జనాభా హెచ్చినా తగ్గినా, పెట్టుబడిధనం హెచ్చినా తగ్గినా, దేశీయ వ్యాపారంగాని విదేశీయ వ్యాపారంగాని హెచ్చినా తగ్గినా, ప్రభుత్వ వ్యయాలు హెచ్చినా తగ్గినా ఇటువంటివన్నీ ఆర్థికరంగాన్ని కలచివేస్తాయి. అందువల్ల సదా జాగ్రత్తగావుంటి, దానిని తిరిగి చక్కబరచడానికి కొత్త చర్యలు తీసుకొనడం అవసరం. ఈ విషయంలో అమెరికన్ కాంగ్రెసు వ్యవహరించినంత చక్కగా ఏ యూరపియన్ పార్లమెంటూ వ్యవహరించలేదు.

ఆర్థిక రంగంలో ప్రభుత్వం ఒక ముఖ్య భాగం

అమెరికాలో ఈనాడు ప్రభుత్వ విధానాలకు ఉన్నంత ప్రాముఖ్యం మునుపెన్నడూ లేదు; ఇరవై సంవత్సరాల క్రిందట న్యూడీల్ రోజులలో కూడా వాటికి ఇంత ప్రాముఖ్యంలేదు. మొత్తం జాతీయ ఆదాయంలో సుమారు అయిదవవంతో అంతకుమించో ధనం ఫెడరల్, స్టేట్ ప్రభుత్వాల చేతుల మీదుగా ఖర్చు వుతుంది; మొత్తం కార్మికులలో పదవవంతుకుపైగా ప్రభుత్వ కార్యాలలోనో, అమెరికా సైనిక దళాలలోనో వున్నారు. ఇటీవల అనేక సార్లు ప్రెసిడెంటు, ఆయన సలహాదారులు చెప్పినట్లు, అమెరికా ఆర్థిక రంగాన్ని మార్పుచెయ్యగల ఒకే వొక ప్రధానాంశం బహుశా ప్రభుత్వపు బడ్జెట్టుమాత్రమే. ఆర్థిక రంగాన్ని అభివృద్ధిపరచడానికి బడ్జెట్టును ఏ విధంగా వినియోగించాలనే విషయం మీద రిపబ్లికనులు డెమోక్రాట్‌లు, కార్మికులు మేనేజ్‌మెంటు, పారిశ్రామికులు వ్యవసాయదారులు ఒకరితో వొకరు ఏకీభవించరు. అయినప్పటికీ, అది అతి ముఖ్యాంశమనిమాత్రం వీరందరూ ఒప్పుకుంటారు. (కాంగ్రెసువారు చివరకు తయారుచేసే చట్టం విభిన్నాభిప్రాయాలు గలవారు రాజీ పడిన మీదట తయారవుతుంది) కాంగ్రెసు

వారు శ్రద్ధ వహించేది పన్నులు విధించడం, వాటిని ఖర్చుపెట్టడం గురించి మాత్రమేకాదు. ముఖ్యంగా విదేశవ్యాపారం, కరెన్సీ మొదలైన విషయాలలో మాత్రమేకాక, అప్పులు, పబ్లిక్ వర్కు్స, వ్యవసాయం మొదలైన వాటికి సంబంధించిన విషయాలలోకూడా శాసనాలుచెయ్యడం అవసరమని కాంగ్రెసుకు తోచింది. అమెరికా ఆర్థిక వ్యవస్థ అస్తవ్యస్తంగా, అయోమయంగా వుంటుందని అనుకొనేవారు, ప్రభుత్వం దానికి సంబంధించిన శాసనాలను వేటిని చేసిందో చూడాలి: అటువంటి శాసనాలను చాలాచేసింది. శాసనాలు అనేకం ఉన్నాయనేదికాక, అవి ఒక పద్ధతిగా ఉన్నాయనేది ముఖ్యం. అయితే అవి సమష్టివిధానంలో, వర్గ ప్రాబల్యవిధానంలో, వ్యాపార లాభ విధానంలో చెయ్యబడే శాసనాలకు భిన్నమైనవి. నిరంకుశ పరిపాలనకంటే ప్రజాస్వామిక పరిపాలన కష్టతరమైనట్లే, ఆర్థిక స్వేచ్ఛకు వ్యతిరేకంగా శాసనాలు చెయ్యడంకంటె దాని పరిరక్షణకు చెయ్యడం కష్టతరమైన విషయమని అమెరికనులు గ్రహించారు: అమెరికా కాంగ్రెసు మొత్తం మీద తన బాధ్యతను సంతృప్తికరంగా నెరవేర్చిందని ఈ శాసనాల ఫలితాలను చూచిన వారెవరైనా అనగలరు.

---

# IV ఫలితాలు

సంగ్రహం—హేతువాదమార్గం—గతాన్ని మరచిన అమెరికనులు—వర్గప్రాబల్య వాదం, సమష్టివాదం, వ్యాపార లాభ వాదం—ఉత్పత్తులు—పారిశ్రామిక సూచికలు—వ్యవసాయక సూచికలు—ప్రమాణాలు—కొన్ని లెక్కలు—అభివృద్ధి జరిగిన రేటు—వ్యక్తి ఆదాయంలో పెరుగుదల—కుటుంబాలు—ఇళ్ళు—కారులు మొదలైనవి—ఒక పోలిక—పేదరికం ఇంకా నశించలేదు—శ్రమ వల్ల, పెట్టుబడి వల్ల, పంటల వల్ల వచ్చే ఆదాయం—లాభాలు—కార్మికుల ఆదాయం—తక్కువ ఆదాయపరులు—ఆదాయాల హెచ్చు తగ్గులలో దిద్దుబాటు—వర్గాల వారీగా ఆదాయాలు—మరొక పోలిక—కేంద్ర సాంఘిక భద్రతా పథకం—ప్రయివేటు పథకాలు—కనీస వేతనాలు, మోటూరు కార్మికుల సంఘం—నిరుద్యోగ భీమా—ఆదాలు—ఒక మధ్యతరగతి సంఘం—సత్యాన్వేషణ—విద్యాబోధ—చర్చిలు—సైన్సు అభివృద్ధి—పుస్తక ప్రచురణ—మ్యూజియములు, నాటకశాలలు మొదలైనవి—ఫౌండేషనులు—నియంతృత్వంమీద పోరాటం—ప్రయోజనాలు—ఒత్తిడి—తుదకు భద్రత—ఆర్థికంగా అమెరికాతో ముడిపడిన ఇతర దేశాలు—భౌతిక సంపదకు ఉత్తమ విధానం.

**హేతువాద మార్గం**

ఏ విషయంగురించి అయినాసరే అమెరికాలో విమర్శనా పూర్వకంగా, సహేతుకంగా ఆలోచిస్తారు. ఇది అమెరికాలో అతి విస్తారంగా వ్యాపించివున్న లక్షణం. ఇప్పటికీ ఇదే ఎక్కువగా ఉంది. అందుచేత, ఆర్థికవిధానం విలువగాని, మరొక విధానం విలువగాని అదియిచ్చే ఫలితాలను బట్టి, దాని లక్ష్యాన్నిబట్టి పరిశీలించాలని వారు తలపోస్తుంటారు. అమెరికనుల లక్ష్యాలు స్పష్టమైనవి. అవి 1688 నాటి కొందరు ఇంగ్లీషు విప్లవకారుల లక్ష్యాలు. అమెరి

కనులు వాటిని తమ స్వాతంత్ర్య ప్రకటనలో పొందుపరచారు. అవి : "జీవించడం; స్వేచ్ఛపొందడం; సౌఖ్యాన్వేషణ చేసుకొనడం". అమెరికనులకు సంతృప్తి కలిగించిన రెండు విషయాలున్నాయి. వాటిలో మొదటిది, తాము ఆచరించుకుంటున్న కాపిటలిజంలో అనేక లోపాలుకూడా ఉన్నప్పటికీ, అది సత్ఫలితాలు సమకూర్చింది. రెండవది, మరొక పద్ధతివలన ఇంకా మంచి ఫలితాలు కలుగుతాయనడానికి గతానుభవాలవల్ల గాని, ప్రస్తుతానుభవాలవల్లగాని ఎటువంటి నిదర్శనాలూ కనిపించడం లేదు.

గతాన్ని మరచిన యూరోపియనులు

కాపిటలిజంవలన పూర్వం కలిగిన ప్రయోజనాలను యూరపియనులు మరచిపోయేటంతగా అది అపఖ్యాతి పాలుకావడానికి, యూరపియన్ వ్యాపారస్తుల గుత్తవ్యాపార పద్ధతులు, వారి సంకుచిత స్వభావమూ, వారి అతిస్వార్థపరత్వమూ చాలావరకు హేతువులు. గ్రేట్ బ్రిటను, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీలు కాపిటలిజానికి పూర్వపు ఆర్థిక వ్యవస్థలలో వున్నప్పుడుకంటె, కాపిటలిజంలో వున్నప్పుడే ఎక్కువ భౌతిక ప్రయోజనాలు పొందినవనే విషయాన్ని ఆ దేశాల ప్రజలకు గ్రహింపు కానట్టు తోస్తుంది; లేక, వాటి దరిమిలా గుత్తవ్యాపార విధానంలో కంటె, వ్యాపారలాభ విధానంలో కంటె, సమష్టి విధానంలోకంటె, వర్గప్రాబల్య విధానంలోకంటె కాపిటలిజంలో ఎక్కువ ప్రయోజనాలు కలిగాయనేది వారు తెలుసుకున్నట్టు లేరు. గత యుద్ధానంతరం ఇటీవలి సంవత్సరాలలో పశ్చిమ జర్మనీ, బ్రిటను, ఇటలీ, ఫ్రాన్సు, బెల్జియం, నెదర్‌లాండ్సులలో పరిశ్రమలు, వ్యవసాయాలు అభివృద్ధి కావడంబట్టి చూస్తే, వాటి పునర్నిర్మాణానికీ, ఆర్థిక స్వేచ్ఛకూ కొంత పరస్పర సంబంధం వున్నట్టు కనిపిస్తుంది.

వర్గ ప్రాబల్యవాదం, సమష్టి వాదం, వ్యాపార లాభవాదం

"జీవించండ, స్వేచ్ఛ పొందడం, సౌఖ్యాన్వేషణ చేసుకొనడం" ఈ సూత్రానికీ, వర్గ ప్రాబల్య, సమష్టి విధానాలకూ ఎంతెంత తేడా వున్నదీ యూరపులో ఇటీవలి దశాబ్దాలలో జరిగిన సంఘటనలు వ్యక్తపరుస్తాయి.
స్పెయిన్ మొదలుకొని సోవియెట్ యూనియనువరకుగల అనేకదేశాలలో లక్షల కొలది ప్రజలు మృత్యువాతపడ్డారు. అంతకంటె పదింతలమంది ప్రజలు బానిస

యాయి. అమెరికన్ లక్ష్యాలను గాని, దాని అమూల్యసూత్రాలనుగాని పరిగణించక, దాని భౌతికప్రయోజనాలనుమాత్రమే లెక్కలోకి తీసుకొని చూచినప్పటికీ, వర్గ ప్రాబల్యవిధానము, సమష్టి విధానమూ ఎంత చెడ్డవో, అనేక సందర్భాలలో అవి ఎటువంటి దారుణాలకు దారితీశాయో తెలుస్తుంది. జర్మనీ, ఇటలీలలో వర్గ ప్రాబల్యవిధానం యుద్ధానికి కారణమైంది. యుద్ధం అంతమయేసరికి జర్మనులు, ఇటాలియనులు తాము ఆర్థిక స్వేచ్ఛా విధానంలో వున్నప్పటికంటె ఎక్కువ పేదరికంలోకి వచ్చారు. ఐబీరియన్ దేశాలలోను, దక్షిణ అమెరికా దేశాలలోను, ఇటీవల మధ్యప్రాచ్యంలో డిక్టేటర్ల క్రిందకు వచ్చిన దేశాలలోను వర్గ ప్రాబల్య విధానంవల్ల అవి ఎదుగూ బొదుగూ లేకుండా వుండడం తప్ప మరే ఫలితమూ కలగలేదు. సమష్టి విధానంతో, ప్రభుత్వ యాజమాన్యంతో, తమ సొంత ప్లానింగుతో భూలోకస్వర్గాన్ని సృష్టించగలమని సోషలిస్టులు వాగ్దాన మిచ్చారు. సోషలిస్టు వ్యవస్థను నెలకొల్పడం నిమిత్తం అధికారాన్ని కైవసం చేసుకొన్నవారు ఆర్థిక రంగాన్ని పునర్నిర్మించడానికి రక్తాన్ని కాలువలు కట్టించినచోట భౌతిక సంపదాభివృద్ధి తక్కువగా జరిగింది; అదే దేశంలో పోటీ తత్వంగల కాపిటలిజం వున్నప్పటికంటె అభివృద్ధి తక్కువ జరిగింది. (సోవియెట్ యూనియన్‌లో కార్మికుల చేత 30 సంవత్సరాలుగా పరిశ్రమలలో నిర్బంధంగా పనులు చేయిస్తున్నప్పటికీ, 1870-1900 సంవత్సరాల మధ్య అమెరికాలోగాని, జర్మనీలోగాని జరిగినంత అభివృద్ధి దానిలో జరగలేదు.) ఉదార సాంప్రదాయ ప్రభావ ఫలితంగా సోషలిజం కార్మికతత్వంక్రిందకు, సాంఘిక ప్రజాస్వామ్యం క్రిందకు మారి, సమష్టవిధానం స్థానే వ్యాపార లాభవిధానం వచ్చినచోట జరిగిన ఆర్థికాభివృద్ధి, ప్రభుత్వం ప్లానుప్రకారం ఆర్థికవ్యవస్థ నెలకొనడానికి పూర్వం జరిగినప్పటికంటె చాలా తక్కువ జరిగింది. (తత్ఫలితంగా, మన సారా ప్రజాక్షేమం కోరిన అనేకమంది కార్మికవాదులు, సాంఘిక ప్రజాస్వామికవాదులు ఆర్థిక సమస్యలను గురించిన తమ అభిప్రాయాలను మార్చుకొంటూ, బ్రిటిష్ శిఘారం లిబరలులలాగ, యూరపియన్ రాడికలులలాగ మారుతున్నారు).




అమెరికాలో సుమారు అయిదుకోట్ల కుటుంబాలున్నాయి. వీటికి అయిదుకోట్లకు — మోటారుకారు లున్నాయి.

# మిక్కిలి వృద్ధి అయిన ఆర్థిక వ్యవస్థ

ఉత్పత్తులు ప్రపంచ భూమి విస్తీర్ణంలో అమెరికా నూటికి 6.3 వంతులు వుంది. ప్రపంచ జనాభాలో అమెరికనులు నూటికి 6.6 వంతులమంది వున్నారు. ఐక్యరాజ్యసమితి ప్రచురించిన ఇయర్ బుక్ ప్రకారం అమెరికా ప్రజల ఆదాయం మొత్తం ప్రపంచ ప్రజల ఆదాయంలో సుమారు సగం వుంది—అంటే, 1955 లో మొత్తం ప్రపంచ ప్రజల ఆదాయం 80,000 కోట్ల డాలర్లనుంచి 90,000 కోట్ల డాలర్లవరకుపుంటే, అమెరికా ప్రజల ఆదాయం 40,000 కోట్ల డాలర్లు వుంది. (అమెరికా ప్రజల ఆదాయంలో తెరమరుగునవున్న ఆదాయాలు దీనిలో చేర్చబడలేదు. ఈ రహస్యపు ఆదాయాల మొత్తం, అమెరికా ఆదాయంలో పదవవంతు, ప్రపంచ ఆదాయంలో అయిదవవంతు వుంటుంది). ప్రపంచంలో ఉత్పత్తి అయే ముడిసరకుల మొత్తంలో అయిదింట రెండు వంతులకు పైగాను, ఫ్యాక్టరీ సరకులలో సగంనుంచి అయిదింట మూడు వంతుల వరకున్నూ అమెరికాలో ఉత్పత్తి అవుతాయి.

పారిశ్రామిక సూచికలు ఒకదేశం ఎంత ఎక్కువగా ఎలక్ట్రిసిటీని, ఉక్కునూ ఉత్పత్తి చెయ్యగలిగితే అది అంత పారిశ్రామికాభివృద్ధి పొందుతుంది. 1951 లో అమెరికా వినియోగపరచిన మొత్తం శక్తి నేలబొగ్గు వలన వచ్చి వుంటుందనే లెక్కక్రింద అంచనావేస్తే, అది వాడిన బొగ్గు 120 కోట్ల టన్నులు వుంటుంది. అంటే. కమ్యూనిస్టుల కంట్రోలులో లేని ఇరవై పశ్చిమ యూరపియన్ దేశాలలో మొత్తం వినియోగమైన బొగ్గుకు రెట్టింపు ప్రమాణంగల బొగ్గును అమెరికా ఉపయోగించుకొన్నదన్న మాట; సోవియెట్ యూనియన్‌లో ఉపయోగించబడిన బొగ్గుకంటె ఇది నాలుగురెట్లు; జనాభాను బట్టి చూస్తే. అమెరికనులు పైన తెల్పినవాటికంటె కూడా, హెచ్చుగా వాటిని ఉత్పత్తి చేసినట్లు లెక్కకువస్తుంది; ఎలాగంటే. పశ్చిమ యూరప్ జనాభాలో సగంకంటె కొంచెం ఎక్కువమందితో అమెరికా జనాభా సమానం; సోవియెట్ యూనియన్ జనాభాలో నాలుగింట మూడు వంతులతో సమానం. 1953 లో

అమెరికా పదికోట్ల టన్నులకుపైగా ఉక్కును ఉత్పత్తిచేసింది; ఇది పశ్చిమ యూరప్‌లో ఉత్పత్తిఅయిన ఉక్కుకంటె సుమారు రెండురెట్లు ఎక్కువ; సోవియెట్ యూనియన్‌లో ఉత్పత్తి అయిన దానికంటె మూడురెట్లు ఎక్కువ. 1955 లో అమెరికా ఉక్కు ఉత్పత్తి 11 కోట్ల 50 లక్షల టన్నులకు పెరిగింది.

వ్యావసాయక సూచికలు

వ్యవసాయాభివృద్ధిని చూపే అతి ముఖ్యమైన సూచనలు ధాన్యం పంటలు, పశువులున్నూ. 1952 లో అమెరికా, ప్రపంచంలో పెద్ద పంటలైన అయిదు ధాన్యం పంటలలో నూటికి 26 వంతులను పండించింది. ప్రపంచంలోని పాడిపశువులు, గుర్రాలు, పందులలో నూటికి 13 వంతులు అమెరికాలో ఉన్నాయి.

రవాణాలు

అమెరికాలో రోడ్లమీద, రైళ్ళమీద జరిగే రవాణాల సంగతి లోకవిదితం. ప్రస్తుతం అమెరికాలో ప్రజల ప్రయాణాలకు అయిదుకోట్ల మోటారుకారు లున్నాయి. వచ్చే కొలది సంవత్సరాలలో మరొక మూడుకోట్ల కారులను ఉత్పత్తి చేయడానికి అమెరికన్ మోటారు పరిశ్రమలు ఎక్కువగా పని చేస్తున్నాయి. 1955 లో ప్రపంచం మొత్తంలో విమాన ప్రయాణాలు చేసినవారిలో సగంమందికిపైగా అమెరికాలో విమాన ప్రయాణాలు చేసినవారు. ప్రపంచంలో ప్రయాణాలకు తిరుగుతున్న విమానాలలో నూటికి 80 వంతులు అమెరికాలో తయారైనవి; ప్రయాణాలకు, సరకుల రవాణాలకు అమెరికాలో వినియోగించబడుతున్న విమానాలు కాక, ఇతరత్రా వ్యాపారం నిమిత్తం ఉపయోగించబడుతున్న విమానాలు 12000 ఉన్నాయి. వీటిసంఖ్య ఇంకా త్వరితగతిని పెరుగుతూంది. ప్రపంచంలోని వాణిజ్య నౌకలలో సుమారు మూడవవంతు నౌకలు అమెరికా వాణిజ్య నౌకలు.

## మహాశక్తిగల ఆర్థిక వ్యవస్థ

కొన్ని లెక్కలు

జార్జ్‌సూల్ తెల్పిన లెక్కల ప్రకారం అమెరికా సాధించిన కొన్ని విజయాలు ఇవి: "1891–1900 సంవత్సరాల మధ్యగల పదిసంవత్సరాలలోకంటె 1941–1950 సంవత్సరాల మధ్యగల పది సంవత్సరాలలో అమెరికా అయిదింతలకు పైగా సరకులను ఉత్పత్తి

చేసింది....జనాభా రెట్టింపు పెరిగినప్పటికీ, అయిదింతలు పెరిగిన ఉత్పత్తుల కోసం కావలసివచ్చిన కార్మికులసంఖ్య నూటికి 81 వంతులు మాత్రం పెరిగింది. 1891—1900 మధ్యకంటె 1941—1950 మధ్య గంట వొకటికీ నూటికి 181 వంతుల చొప్పున ఎక్కువగా సరకులు ఉత్పత్తి అయాయి....1950 కి పూర్వం ఉన్న 80 సంవత్సరాలలో అమెరికాలో మనిషి వొకడికి ఆదాయం సాలుకి నూటికి 1.9 వంతులు చొప్పున పెరిగింది....కుటుంబం వొకటికి సగటు ఆదాయం సాలుకి 1000 డాలర్ల నుంచి 5000 డాలర్లకు పెరిగింది."

అభివృద్ధి జరిగిన రేటు

యుద్ధానికి పూర్వం సాలీనా సగటున పండిన పంటలు 1952—53 నాటికి నూటికి 38 వంతులు హెచ్చాయి. (ఈ లెక్కలు ఐక్యరాజ్యసమితి ఇయర్ బుక్‌లో తెల్పబడిన లెక్కల ఆధారంగా తెల్పినవి). ప్రస్తుతంలో అమెరికా ఆర్థికరంగం సాలుకు నూటికి 4 వంతులనుంచి 6 వంతుల రేటు చొప్పున పెరుగుతున్నది (1955 లో నూటికి 7 వంతులు పెరిగింది). అనేకరకాల వస్తువుల ఉత్పత్తి తగ్గుతున్నట్లు, నిరుద్యోగుల సంఖ్యలు తగ్గుతూ హెచ్చుతూ ఉన్నట్లు పదేపదే ప్రకటిస్తూ ఉన్నప్పుడు (ఉదాహరణకు 1949 లోను, తిరిగి 1955 లోను ఉత్పత్తులు తగ్గాయి) ఆర్థికరంగం పెరుగుతున్నదని అంటే విచిత్రంగా కనిపించవచ్చు. కాని, అమెరికా పారిశ్రామికరంగం అపారమైనది కావడంచేత, ఒక శాఖలో జరిగిన తగ్గుదల మరొకశాఖలో జరిగిన హెచ్చుదల ముందు లెక్కించవలసినది కాదు; ప్రాథమికపరిశ్రమలలో, లేదా రెండవరకం పరిశ్రమలలో ఉత్పత్తులు తక్కువై ఉండవచ్చుగాని, మూడవ తరగతి పరిశ్రమల సంఖ్య హెచ్చిపుండవచ్చు; అమెరికా ఆర్థికరంగంలో అన్నిటికంటె హెచ్చు పాత్ర వీటిదే. ప్రపంచంలో మరే దేశం ఆర్థిక వ్యవస్థలోనూ అమెరికాలో వీటికి వున్నంత హెచ్చుపాత్ర లేదు. రైల్వేలద్వారా రవాణాలు హెచ్చుగా జరగకపోవచ్చు; బస్సులువిమానాలు మొదలైన వాటిద్వారా అవి హెచ్చి ఎక్కువలాభాలు వచ్చివుంటాయి; లోహపు సరకుల ఉత్పత్తి తగ్గిపోయి, ప్లాస్టిక్ సరకుల ఉత్పత్తి హెచ్చుతుంది. 1948—1954 మధ్య ఎయిర్ కండిషనింగు యంత్రాల ఉత్పత్తి 17 రెట్లు పెరిగింది; ఆటోమాటిక్ వాషింగ్ యంత్రాల ఉత్పత్తి 10 రెట్లు పెరిగింది; ఫ్రిజిడెయిర్ యంత్రాలలో నిల్వవుంచే ఆహారపదార్థాల ఉత్పత్తి 9 రెట్లు పెరిగింది;

టెలివిజన్ సెట్టుల ఉత్పత్తి 8 రెట్లు పెరిగింది; (రేయన్ తప్ప) కృత్రిమ
దారం ఉత్పత్తి 4 రెట్లు పెరిగింది; ఇలాగే మిగతావి కూడా.

జనాభా తగినంతగా పెరిగినప్పటికీ (1930—1954 వ్యక్తి ఆదాయంలో
మధ్య సుమారు మూడవవంతు పెరిగింది). సుమారు 20 పెరుగుదల
లక్షలమంది అమెరికాలో స్థిరనివాసంకోసం వలసవారు
లుగా వచ్చివున్నప్పటికీ, 1938—1953 మధ్య వ్యక్తి వొకనికి అసలు ఆదా
యం నూటికి సుమారు 60 వంతులు పెరగడానికి ఆర్థికరంగం పైవిధంగా
విస్తరించడమే కారణం.

## జీవన వ్యయ ప్రమాణం

అమెరికాలో సుమారు అయిదుకోట్ల కుటుంబాలువున్నాయి. కుటుంబాలు
పిల్లలున్న కుటుంబాలూ, పిల్లలులేని కుటుంబాలూ కలిపి నాలుగు
కోట్లకుపైగా వున్నాయి. మిగతా కుటుంబాలవారు ముఖ్యంగా యువకులు,
లేదా వృద్ధులు; వీరు సొంత డబ్బుతో జీవిస్తున్నవారు.

అమెరికన్‌కుటుంబాలలో సగానికిపైగా సొంత యిళ్లు వున్నాయి. ఇళ్ళు
జనం ఇరకాటంగావున్న ఇళ్ళు చాలా తక్కువ: నూటికి 83 వంతుల
యిళ్ళు, కుటుంబంలోని వారికి ఒక్కొక్కరికి కనీసం ఒక్కొక్క గది చొప్పున
అయినా వున్న యిళ్ళు; అంతకంటె ఎక్కువ గదులు వున్నవి కూడా చాలా
వున్నాయి. బ్రిటన్, అమెరికాలలోని జనాభాలతో పోల్చి చూస్తే 1953 లో
బ్రిటన్‌లో నిర్మించబడిన క్రొత్త యిళ్ళకంటె అమెరికాలో నూటికి 60 వంతులు
ఎక్కువగా నిర్మించారు; రష్యాలో నిర్మించిన క్రొత్త యిళ్ళకంటె నూటికి
120 వంతులు ఎక్కువగా నిర్మించారు.

అమెరికన్ కుటుంబాలకు అయదుకోట్లకు పైగా కార్లు, కారులు
మూడుకోట్ల టెలివిజన్ సెట్టులు, 12 కోట్ల 50 లక్షల రేడియో మొదలైనవి
సెట్టులు ఉన్నాయి. దేశంలో అయిదుకోట్లకు పైగా టెలిఫోనులు
వున్నాయి.

**ఒక పోలిక** 1951 శీతాకాలంలో అమెరికాలో ఒక్కొక్క కిలో బరువున్న మాంసం, రొట్టె, వెన్న, బంగాళాదుంపలు, పంచదార కొనడానికి పరిశ్రమలలో 2 గంటల 40 నిమిషాలు పనిచేస్తే వచ్చే సగటు వేతనం సరిపోయేది. ఇవే సరకులు కొనడానికి బ్రిటనులో 3 గంటలూ, సోవియెట్ యూనియన్‌లో సుమారు 20 గంటలూ పని చేసేవారు. అమెరికాలో ఒక పురుషునికి ప్రత్తిబట్టల సూటు, ఒక జత బూట్లు కొనడానికి కావలసిన డబ్బు 50 గంటలు పనిచేస్తే వచ్చింది; బ్రిటనులోనైతే 96 గంటలూ, సోవియెట్ యూనియన్‌లోనైతే 258 గంటలూ పనికాలం పట్టింది.

**పేదరికం ఇంకా నశించ లేదు** ఇవన్నీ ఇలావున్నప్పటికీ, అమెరికాలో ఈనాడు కూడా పేదరికమూ వుంది, పూరికొంపలూ వున్నాయి. ఈ విషయం గురించి ప్రొఫెసరు గాల్ బ్రయిత్ ఇలా వ్రాస్తున్నాడు: "అనాగరికంగా, అతిహీనంగా వున్న రైతుకుటుంబాలు సుమారు 20 లక్షలవరకు వున్నాయి (ద్వితీయ ప్రపంచయుద్ధం తరువాత సంగతి ఇది). టర్కీకి పశ్చిమానవున్న ఏ దేశంలోని పేదలకంటెకూడా వీరు నయంగా వున్నవారు కారు. వీరిలో అనేకమంది దక్షిణ అపలాచియన్ ప్రాంతంలో వున్నారు. నగరాలలో మురికిపేటలలో నివసించినవారు, మైనారిటీ జాతులవారు—ముఖ్యంగా నీగ్రోలు—పేదరికాన్ని అనుభవిస్తూ, దుస్థితిలో వున్నారు. ప్రతినెలా ఎదుగూ బొదుగూలేని జీతమో, పెన్షనో, నిల్వ డబ్బుమీద వడ్డీయో తెచ్చుకొంటూ జీవించినవారి స్థితిగతులుకూడా ఇంతే." పేదరికాన్ని పోగొట్టి, మురికిపేటలను శుభ్రపరచడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. పూర్వంలాగే, యూరప్ దేశాలనుంచి కార్మికులు తెరిపిలేకుండా వలసవచ్చారు. వారికి పూర్వం వున్న పేదలు కొంత వృద్ధిలోకి వచ్చేసరికి ఈ విధంగా క్రొత్తగా వచ్చినవారు పేదరికంతో వచ్చి, కొనాళ్ళకు ఒక మెట్టుపైకి వెడుతూ వుండేవారు. అందుచేత పేదలు ఎప్పుడూ వుంటూనే వున్నారు. ఈనాడు పోర్టోరీకన్‌లు, ఫ్రెంచి కెనడియన్‌లు, మెక్సికన్‌లు అమెరికాకు వేలకొలది వచ్చి ఇలాగ పేదలుగా వుంటున్నారు. మరేదేశంలోనూ సాధ్యం కానంత వేగంగా వారు ఆర్థికరంగంలో ఒక్కొక్క మెట్టే పైకి వెడతారు.

# ఆ దా య ం

శ్రమ వల్ల, పెట్టుబడి వల్ల, పంటలవల్ల వచ్చే ఆదాయం

1955లో అమెరికన్ ప్రజల వ్యక్తిగత ఆదాయం సుమారు 30,000 కోట్ల డాలర్లు. ఈ మొత్తంలో నూటికి 80 వంతులు కార్మికులు సంపాదించుకొన్నది. వ్యక్తిగత ఆదాయం క్రిందకు తరచు జీతాలను మాత్రమే లెక్కలోకి తీసుకుంటారు. రైతు, చిన్న షాపువాడు, నిపుణుడు తమతమ పనులలో కష్టపడి సంపాదించుకున్నప్పటికీ, వారివి ఆదాయాలు కానట్లు ఆ డబ్బును ఈ లెక్కలలో చేర్చరు. అందుచేత, కార్మికుల ఆదాయం కాయకష్ట ఫలితమనీ, మిగిలిన వారి ఆదాయం లాభాలనీ జమకట్టడం అర్థం లేని పని. 1950 లో అమెరికన్ ప్రజల వ్యక్తిగత ఆదాయం 22,300 కోట్ల డాలర్లు కాగా, 14,500 కోట్ల డాలర్లు (జీవిత భీమా మొదలైన వాటికి చెల్లించినది కాక) అన్నిరకాల జీతగాళ్ళూ సంపాదించుకున్న ధనం. అంటే, జీతగాళ్ళలో ప్రతి ఒకడికి సాలుసరి ఆదాయం 3,200 డాలర్లు అయింది. ఆ సంవత్సరంలో రైతులు, వ్యాపారస్తులు మొదలైనవారు సంపాదించుకున్న డబ్బు 3,500 కోట్ల డాలర్లు. అంటే, వారిలో ఒక్కొక్కని ఆదాయం సగటున 4000 డాలర్లకు కొద్ది తక్కువగా అయింది. ముఖ్యంగా శిస్తులవల్ల, వడ్డీలవల్ల, షేర్లనుంచి వచ్చే లాభాలవల్ల 2,200 కోట్ల డాలర్ల ఆదాయం వచ్చింది; ఇది మొత్తం ఆదాయంలో సుమారు పదవవంతు మాత్రమే; ఈ ధనం సుమారు 1 కోటి 50 లక్షలమందికి వచ్చింది (సగటున ఒక్కొక్కడికి 1500 డాలర్లు); వారిలో అత్యధికసంఖ్యాకులు రైతులు, చిన్న వ్యాపారస్తులు మొదలైనవారు.

లాభాలు

అమెరికన్ వ్యాపారస్తులు పొందిన లాభాలకు సమష్టివాదులు గుండెలు బాదుకుంటారు. ఒకవైపున లక్షలాది కార్మికులు ఆకలి బాధతో అలమటిస్తూ వుండగా, మరొకవైపున బానిసలచేత పని చేయించు

కొంటూ, ధనమదాంధులై, పొట్టలు నింపిన సోమరిపోతు కాపిటలిస్టులు కొన్ని వేలమంది వున్నట్టు వారి కళ్ళకు అమెరికా కనిపిస్తుంది. ఇది పొరపాటు అని తెలుసుకోవాలంటే, ఈ సంగతులను యోచించాలి: (1) అమెరికాలో కాపిటలిస్టులు అనేక లక్షలమంది వున్నారుగాని, కొన్నివేలమంది కాదు; (2) పెట్టుబడిదారుడైన "కాపిటలిస్టుకు" చేరే లాభం, వివిధకంపెనీలు పొందినలాభంలో కొద్దిపాటిమాత్రమే. 1950 లో అమెరికన్ కంపెనీలు మొత్తం 4,300 కోట్ల డాలర్ల లాభం పొందాయి; దీనిలో 2,200 కోట్ల డాలర్లు పన్నుల క్రింద ఖర్చయాయి; 1,200 కోట్ల డాలర్లు తిరిగి పెట్టుబడి క్రింద ఖర్చయాయి; 900 కోట్ల డాలర్లు మాత్రమే లాభం క్రింద మిగిలాయి. ఆ సంవత్సరం పౌరులకు వ్యక్తిగత ఆదాయం క్రింద లభించిన మొత్తంలాభం వారి ఆదాయంలో నూటికి నాలుగువంతులు మాత్రం వుంది. 1950 తరువాత నుంచి ఈ లాభాల మొత్తంలోగాని, పెట్టుబడిదారుల వంతుకు వచ్చిన లాభాల మొత్తంలోగాని అట్టే మార్పేమీ లేదు. యూరప్‌లో వ్యాపారలాభ ఆర్థిక వ్యవస్థలలోను, వర్గప్రాబల్య ఆర్థిక వ్యవస్థలలోను మిగిలే లాభంకంటే అమెరికా కాపిటలిజంలో మిగిలేది తక్కువ. సమష్టి ఆర్థిక విధానంలో చీడపురుగులుగా వుండే అసంఖ్యాక అధికారులకు యిచ్చే జీతాలు మొదలైన వాటిని బట్టి ఆ విధానంవల్ల వచ్చిన లాభం తెలుస్తుంది: సోవియెట్ యూనియన్ జాతీయ ఆదాయంలో నూటికి నాలుగువంతులకు పైగా ఈ అధికారులకు దక్కుతుంది. 1955 లో అమెరికాకు వచ్చిన మొత్తం లాభం సుమారు 4,400 కోట్ల డాలర్లయితే, పన్నుల క్రింద 2,400 కోట్ల డాలర్లు ఖర్చయాయి.

**కార్మికుల ఆదాయం** అమెరికా జనాభాలోని వివిధవర్గాలలో కల్లా పెద్దవర్గం ఏదంటే, పరిశ్రమలలో అర్థ నిపుణకార్మికులుగానూ, నిపుణకార్మికులుగానూ వున్న వర్గం. మొత్తం 6 కోట్ల 50 లక్షలమంది కార్మికులలోను వీరు సుమారు మూడవవంతుమంది వున్నారు. అర్థనిపుణ కార్మికుల కుటుంబం వొకటికి ప్రస్తుత ఆదాయం సాలీనా 3,500 డాలర్లనుంచి 4,500 డాలర్లవరకు

వుంది; నిపుణ కార్మికుల అత్యధిక కుటుంబాలలో ఒక్కొక్కవానికి సాలీనా ఆదాయం 4,000 డాలర్ల నుంచి 6,000 డాలర్ల వరకువుంది. 1954 వసంతకాలంలో డిట్రాయిట్ నగరంలో (35 లక్షల మంది జనాభా) 9,20,000 కుటుంబాలున్నాయి. ఆ నగరంలో వున్న షాపులలో, ఆఫీసులలో, ఫ్యాక్టరీలలో పని చేస్తున్న 13,50,000 మంది కార్మికులు ఈ కుటుంబాలలోని వారు; ఫ్యాక్టరీ కార్మికుడు వొకడికి సగటున 4,700 డాలర్లు సంపాదిస్తూండే వాడు; ఇతడి కుటుంబంలోనే వున్న మరొకడు రోజుకి ఏదో కొంతసేపు పనిచేస్తే ఆ కుటుంబ ఆదాయం 6,000 డాలర్లకు పైన పడేది; ఈ కుటుంబాలలో నూటికి 62 వంతులకు సొంత యిళ్ళు వున్నాయి.

1953 లో అమెరికా జనాభాలో సుమారు నాలుగవ తక్కువ ఆదాయ
వంతు మందికి ఒక్కొక్కడి ఆదాయం 2,000 డాలర్లు, పరులు
లేదా అంతకంటె తక్కువ; అంటే సామాన్య ఆదాయం
కంటె చాలా తక్కువన్నమాట. ఈ నాలుగవవంతు జనాభాలో ముఖ్యంగా వున్నవారు వీరు ; (1) విద్యాభ్యాసమో, వృత్తి విద్యో పూర్తి కాని యువకులు; (2) రైతులు; (3) కుటుంబ భారంలేనివారు ; వీరిలో చాలా మంది వృద్ధులు; (4) నీగ్రోలు, ఈమధ్య వచ్చిన పోర్టోరికనులు, మెక్సికనులున్నూ. 1-వ తరగతిలోని వారు సాధారణంగా 22—28 సంవత్సరాల మధ్య వయస్సులలో తమ చదువు పూర్తికాగానే హెచ్చు జీతాలు తెచ్చుకుంటారు. రైతులను గురించిన లెక్కలు పొరపాటు అభిప్రాయం కలిగిస్తాయి; ఎందుకంటే వారికి రొఖ్ఖ రూపంలో వచ్చే దొకటే ఆదాయం కాదు; ఫ్యాక్టరీ కార్మికులకూ, ఆఫీసు పనివారికీ వున్నట్లే వారికి కూడా ఇతర ఆదాయం వుంటుంది. వృద్ధుల ఆదాయం వృద్ధికావడానికి చర్యలు తీసుకోవాలని ప్రస్తుత ప్రభుత్వం కాంగ్రెసుకు కొన్ని ప్లానులను సమర్పించింది. పోతే, మిగతా జనాభా స్థితితో పోలిస్తే, నీగ్రోలు మొదలైనవారి ప్రస్తుత ఆదాయస్థితి చాలా వేగంగా హెచ్చుతూంది.



అమెరికాలో సొంతభూములున్న రైతులు 40,00,000 మంది వున్నారు. వారు తమ యిష్టం వచ్చిన పంటలను వాటిలో పండించుకొనవచ్చు. తమ కష్టానికి వీలైనంత హెచ్చు ఫలితం పొందాలని వారి ఆశయం.

# ఆర్థిక వర్గాలు

అమెరికాలో ఆదాయాలు ఒక స్థాయికి వస్తు ఆదాయాల హెచ్చు న్నాయి. జనాభాలో నూరింట అయిదువంతుల మంది తగ్గులలో దిద్దుబాటు ఉన్నతస్థాయిలో వున్నారు. 1928 లో వీరికి మొత్తం జాతీయ ఆదాయంలో నూటికి 34 వంతులు లభించగా, 1948 లో నూటికి 18 వంతులకు తక్కువగా లభించింది. ప్రజలలో అతి తక్కువ సంపాదనపరులైన నైపుణ్యరహిత కార్మికులు మొత్తం కార్మికులలో 1930లో నాలుగవవంతుమందీ, 1950 లో పదవవంతుమందీ వున్నారు. 1955 అక్టోబరు నెలలో "న్యూయార్కు టైమ్సు" పత్రిక ప్రచురించిన వివరాలనుబట్టి ఆదాయాలు ఏ విధంగా ఒకస్థాయికి వస్తున్నాయో తెలుస్తుంది. ఈ వివరాలు 1904 వ సంవత్సరంలోను, 1954 వ సంవత్సరంలోను అయిదు వివిధ వర్గాలకు సంబంధించినవి. (ఈ వర్గాలు ఇవి: సరకులు ఉత్పత్తిచేసే ఫ్యాక్టరీలలోని యావన్మంది కార్మికులు; మోటారు ఫ్యాక్టరీ కార్మికులు; రైల్వే ఇంజనీర్లు; కాలేజి అధ్యాపకులు; పెద్ద రైల్వే కంపెనీల మేనేజర్లు). సరకుల ఫ్యాక్టరీల కార్మికులందరి ఆదాయం 1 అనుకుంటే, మిగతా వర్గాల ఆదాయాలు 1904 లో ఇవి : 1.2, 2.7, 4.2, 5.8. 1954 లో ఇవి: 1.2, 1.6, 1.3, 2.6. ఈవిధంగా మొదటివర్గంవారికి చివరి వర్గంవారికి ఆదాయంలో వున్న తేడా సగానికి తగ్గిపోయింది. యుద్ధానంతరకాలంలో ఇదే విధంగా జరిగింది : మేనేజర్ల వర్గానికి, సొంతపనులు చేసుకొనేవారికి సగటున ఆదాయం 2.1 అయితే, నిపుణకార్మికులకూ, అర్ధనిపుణకార్మికులకూ వచ్చిన ఆదాయం 1; ఈ కార్మికుల ఆదాయం 1951 లో 1.8 అయింది.

వివిధవర్గాలవారి ఆదాయాలు వేర్వేరుగా వుండక వర్గాలవారీగా తప్పదు. (ఆర్థిక కార్యాలలో వారు వహించే పాత్రనుబట్టి ఆదాయాలు భేదం వుంటుందనే అర్థంతో చూడాలి). ఆదాయాలను ఒక స్థాయిలో పెట్టడానికి ప్రయత్నించినట్లయితే, ఎవరికి ఎంత

యివ్వడమో, ఎలాగ యివ్వడమో స్పష్టం చెయ్యాలి; ఏమైనా, వాటివలన నిజపరిస్థితులేమిటో సుమారుగా మాత్రమే సూచన అవుతాయి. అమెరికా ఆర్థికవిధానం ఏ స్థితిలోవున్నదో తెలుసుకోడానికి, దానికి పూర్తిగా విరుద్ధమైన సోవియట్ విధానంతో దానిని పోలిస్తే చక్కగా బోధపడుతుంది. ఈ రెండు దేశాలలోవున్న మూడు ముఖ్య ఆర్థికవర్గాలను గురించి పరిశీలించడం సరిపోతుంది : (1) రష్యాలోను, అమెరికాలోను వున్న రైతులు; (2) ఫ్యాక్టరీ కార్మికులు, గుమాస్తాలు; (3) మేనేజర్లవర్గం (సోవియెట్ యూనియన్‌లో వున్న స్టాకనోవైట్‌లతో సహా). రష్యాలో జీతభత్యాలు లేకుండా పనులుచేస్తున్న బానిస కార్మికులను, నిపుణులు కాని కార్మికులను (వీరు అమెరికాలో కంటె ఎక్కువమంది వున్నారు; వీరిజీతాలు అతి స్వల్పం) ఈవర్గాలలో చేర్చలేదు; ఇదేవిధంగా ఉన్నతస్థానాలలో వున్న వారిని (సోవియెట్ యూనియన్‌లోని రాజకీయ నాయకులను, అమెరికాలోని పెద్ద ధనికులను) పైన తెల్పిన వర్గాలలో చేర్చలేదు; ఈ పెద్దల సంఖ్య ఉభయదేశాలలోకూడ తక్కువే; వీరి ఆదాయాలు జనసామాన్యం ఆదాయాలకంటె చాలా హెచ్చు.

**మరొక పోలిక**

రొఖ్ఖం రూపంలోను, ఇతర రూపాలలోను కలిపి సోవియెట్ కర్షక కుటుంబం వొకటికి సాలీనా 1.800 రూబులులనుంచి 2.400 రూబులులవరకు ఆదాయం వస్తుందని అంచనా వేసుకోవచ్చు (ఒక డాలరుకు అమెరికాలో వచ్చినన్ని సరకులు రష్యాలో కొనాలంటే 8 నుంచి 12 రూబులులవరకు ఖర్చుపెట్టాలి). నిపుణుడైన ఒక కార్మికుడు సంపాదించేదీ, అతడి భార్యగాని, కుమారుడుగాని రోజు వొకటికి కొంతసేపు మాత్రం పని చేసి సంపాదించేదీ కలిపినట్లయితే సాలీనా వారి ఆదాయం 8,000 నుంచి 10,000 రూబులులవరకు వుంటుంది. మేనేజరు వొకడికి 25,000 నుంచి 35,000 రూబులులవరకు సంపాదిస్తాడు. ఈ మూడువర్గాలసంపాదనలు సుమారుగా 1 : 4 : 12 నిష్పత్తిలో వున్నాయి. అమెరికాలో చాలామంది రైతులు ఒక్కొక్కడు 2,000 నుంచి 3,000 డాలర్లు (రొఖ్ఖము, తక్కినవి కూడా కలిపి). నిపుణు

కార్మికుని కుటుంబం వొకటికి 4.500 నుంచి 5,500 డాలర్లు, మేనేజర్లలో చాలామంది 10,000 నుంచి 18,000 డాలర్లు సంపాదిస్తారు; వీరు అతి పెద్ద స్థితికి వెళ్ళారనుకుంటే వీరి సంపాదనలు ఈ విధంగా వుంటాయి. (35 సంవత్సరాల లోపు వారి ఆదాయాలను కూడా చేర్చినట్లయితే ఈ అంకెలు ఇంతకంటె తగ్గుతాయి). అమెరికాలో ఈ మూడువర్గాల ఆదాయాలు సుమారుగా ఈ నిష్పత్తిలో వుంటాయి—1 : 2 : 5½ (ఈమధ్య రైతుల ఆదాయం తగ్గక పూర్వం ఈ తేడాలు ఇంకా తక్కువ). ఈ తేడాలు సోవియెట్ యూనియన్‌లోకంటె పశ్చిమ యూరప్‌లో తక్కువ; కాని అమెరికాలో కంటె ఎక్కువ. ఇంతకు ముందే చెప్పినట్టు, అమెరికాలో ధనికవర్గం ఆదాయానికి, జనసామాన్యం ఆదాయానికి వున్న తేడా, సోవియెట్ యూనియన్‌లోకంటె, పశ్చిమ యూరప్‌లోకంటె తక్కువగా వుంది. కమ్యూనిస్టుల కంట్రోలులోని అన్నిదేశాలలోను వున్నట్లు అమెరికాలో జీతభత్యాలు లేని కార్మికులంటూ ఎవరూ లేరు. ఆర్థిక స్వేచ్ఛావిధానంకంటె, లేదా తగినంత ఆర్థిక స్వేచ్ఛ వుండే విధానంకంటె సఘష్టి విధానంవలన ఆర్థిక సమానత్వం సిద్ధించగలదని సోషలిస్టు సిద్ధాంతులు పిడివాదం చేసి నొక్కివక్కాణించడానికి ముందుగా నిజానిజాలను పరిశీలించాలి.

## ఆర్థిక భద్రత

రూజ్వెల్టు చేసిన సాంఘిక భద్రతా చట్టానికి 1950 లోను, 1954 లోను చెయ్యబడిన సవరణలు ఆమోదించబడిన ఫలితంగా కేంద్ర సాంఘిక భద్రతా పథకం సొంత పనులు చేసుకొనేవారు, ఇంకొకరికి పనులు చేసేవారుకూడా ఫెడరల్ ఇన్సూరెన్సు చట్టం క్రిందకు, భార్యాబిడ్డల ఇన్సూరెన్సు చట్టం క్రిందకు వస్తారు. నెలకు సగటున 350 డాలర్లుగాని, అంతకు ఎక్కువగానిజీతం సంపాదించేవారికి (రిటైరు అయే వయస్సు రానున్న వారిలో అత్యధిక సంఖ్యాకులు ఈ జీతాలు సంపాదిస్తారు) 65 వ సంవత్సరం వచ్చినప్పటినుంచీ ఈ చట్టాల ననుసరించి ఒంటరిగా వున్న

వారికి నెలకు 108 డాలర్ల 60 సెంటులు యిస్తారు; వివాహం అయినవారికి 162 డాలర్ల 80 సెంటులు యిస్తారు. అతడు మరణించినట్లయితే అతడి భార్యకు గాని, లేదా అతడిమీద ఆధారపడిన ఒక మనిషికిగాని నెలకు 81 డాలర్ల 40 సెంటులు యిస్తారు. ఆధారపడినవారు ఇద్దరుంటే వారిద్దరికి 162 డాలర్ల 80 సెంటులు యిస్తారు. రిటైరు అయినవానికిగాని, అతని వారసులకు గాని ఈ విధంగా యిచ్చేది ఒక్కొక్కరికి నెలకు 30 డాలర్లకు తక్కువ కాకుండా వుంటుంది.

ప్రయివేటు పథకాలు

సంఘాలుగా ఏర్పడ్డ కార్మికులలో అన్ని బాపతులవారికీ ఫెడరల్ ఇన్సూరెన్సు స్కీములు మాత్రమే కాక, పెన్షన్ స్కీములు కూడా వున్నాయి. బొగ్గుగని కంపెనీలు, ఉక్కు ఫ్యాక్టరీలు, మోటారు కంపెనీలు, పెట్రోలు కంపెనీలు మొదలైనవన్నీ తమవద్ద పనిచేసి రిటైరు అయిన అన్ని బాపతుల పనివారికీ నెలనెలా పెన్షన్లు ఇస్తాయి; ఇవి 100 మొదలు 120 డాలర్లవరకు వుంటాయి. ఉపాధ్యాయులు, డాక్టర్లు, తదితరులు తమ తమ పెన్షను స్కీముల క్రిందకు వస్తారు. చాలాభాగం పరిశ్రమలు వ్యాధిగ్రస్తులకు, గాయపడినవారికి పరిహారం ఇస్తూంటాయి.

కనీస వేతనాలు, మోటారు కార్మికుల సంఘం

ఫెడరల్ ప్రభుత్వం నిర్ణయించిన ప్రకారం 1955 వరకు కనీసవేతనం గంటకు 75 సెంటులు. ఆ సంవత్సరం ఇది ఒక డాలరుకు పెంచబడింది. అమెరికాలో వివిధవర్గాల ఆదాయాలను ఒకస్థాయికి తీసుకురావడానికి క్రమంగా చర్యలు తీసుకోబడుతున్నందున 1955 వ సంవత్సరం ముఖ్యంగా పరిగణించ దగింది. అదే సంవత్సరం జూన్‌లో మోటారు కంపెనీల సొంతదారులు, వాటిలోని పనివారు (యునైటెడ్ ఆటోమొబైల్ వర్కర్స్) ఒక కాంట్రాక్టు చేసుకున్నారు. దానిప్రకారం కార్మికులకు సంవత్సరం పొడవునా పనివున్నా సరే, లేకపోయినా సరే ఆ సంవత్సర జీతమంతా యిచ్చివేయాలి. చాలా



అమెరికాలోని సాంఘిక భద్రతా చట్టాన్ని అనుసరించి ఉద్యోగులకు వృద్ధాప్యపు భీమా, వారసుల భీమా మొదలైనవి వున్నాయి. నెలకు 350 డాలర్లుగాని, అంతకు ఎక్కువగాని సంపాదించేవారికి 65 వ సంవత్సరం వచ్చినప్పటినుంచి (ఒంటరిగావుంటే) నెలకు 108 డాలర్ల 50 సెంట్లు ఇస్తారు; వివాహితులై వుంటే 162 డాలర్ల 80 సెంట్లు ఇస్తారు.

కాలంగా ఇటువంటి కాంట్రాక్టులను క్రింది తరగతి కార్మికులతో వారం వారానికీ వ్రాసుకొనేవారు; మధ్యతరగతి కార్మికులతో ఒక ఏడాదికి వ్రాసుకొనేవారు. ఇప్పుడు క్రిందితరగతి కార్మికులతోకూడా ఒక ఏడాదికి కాంట్రాక్టులు వ్రాసుకుంటున్నారు. మోటారు పరిశ్రమలలాగే కొన్ని ఇతర పరిశ్రమలు కూడా కార్మికులతో ఇదివరకే సాలుసరి కాంట్రాక్టులు వ్రాసుకున్నాయి. మిగతా పరిశ్రమలలోకూడా బహుశా ఇలాగే జరుగుతుంది. అందుచేత, కార్మికులకు చటుక్కున పనులు పోయే ప్రమాదం వచ్చిపడదు.

నిరుద్యోగ భీమా నిరుద్యోగులుగావున్న కార్మికులకు (ఇటీవలి సంవత్సరాలలో కార్మికులలో నూటికి 3 వంతులనుంచి 4 వంతులవరకు వున్నారు) ఆయా స్టేట్ ప్రభుత్వాలు ధనసహాయం చేస్తాయి. ఆ యా స్టేట్ ప్రభుత్వాల ఆర్థిక స్తోమతనుబట్టి వుంటుంది ఇది. డబ్బువున్న ప్రభుత్వాలు నిరుద్యోగ కార్మికులు సామాన్యంగా సంపాదించుకోగల జీతంలో సగంవరకు కూడా యివ్వడం కలదు. ఇటీవల కార్మిక యూనియనులు, కంపెనీలు వ్రాసుకుంటున్న కాంట్రాక్టులలో నిరుద్యోగ పరిహారాలు యిస్తామనికూడా వ్రాసుకుంటున్నారు. ఉదాహరణకు: ఫోర్డు కంపెనీవారు ఒక సంవత్సరం పనిచేసిన ప్రతి కార్మికునికీ ఇటువంటి పరిహారం యిస్తారు. స్టేట్ ప్రభుత్వాలు చేసే ధనసహాయం కాక, వారు అదనంగా ఇచ్చేదిది. ఫోర్డు కంపెనీవారు వారానికి రెండు డాలర్లు మొదలు 25 డాలర్లవరకు 26 వారాలు యిస్తారు. అంటే, ఆ కార్మికునికి జీతంలో నూటికి 65 వంతులు నిరుద్యోగిగావున్న రోజులలో మొదటి నాలుగువారాలకూ, నూటికి 60 వంతులవరకు తక్కిన 22 వారాలకు వస్తుంది. దీనిలోనుంచి ఆదాయం పన్నులు యివ్వనక్కరలేదు. నిరుద్యోగ కార్మికులకు పనులు చూపడానికి అన్ని స్టేట్ ప్రభుత్వాలు సాయపడుతాయి. కార్మికులు ఒక ఫ్యాక్టరీలో పని మానివేసి మరొకదానిలో చేరడం విపరీతంగా జరుగుతూ వుంటుంది. ఇలాగ జరగడం మంచిది కాదు గాని, దీనివల్ల అనర్థాలూ వున్నాయి, ప్రయోజనాలూ వున్నాయని అమెరికనులు భావిస్తారు. కార్మికులు

నిరుద్యోగులైనప్పుడు వారికి పరిహారం లభిస్తున్నది గనుక, అనర్థాలను లెక్క చేసుకో నవసరంలేదని అమెరికను లంటారు. కార్మికులు ఉద్యోగాలను మాన కూడదని నిర్బంధం చేస్తే, చివరకు ఆర్థిక వ్యవస్థయొక్క అభివృద్ధికి అవ రోధం కలుగుతుందని అమెరికనుల నమ్మకం.

అమెరికన్ కుటుంబాలు 1955 లో సుమారు 20,000 కోట్ల ఆదాలు డాలర్లు ఆదా చేశాయి (లైఫ్ ఇన్సూరెన్సు కంపెనీలద్వారా మూడవ వంతు, గవర్నమెంటు బాండులద్వారా నాలుగవవంతుకు పైన, మిగతాది బ్యాంకులలో, పోస్టల్ సేవింగులు మొదలైనవాటిలో ఆదా చేశాయి). ఆదాలు సాలుకు నూటికి 4 వంతులకు పైబడిన రేటు చొప్పున పెరుగుతున్నవి. ఆదాలు లేని కుటుంబాలసంఖ్య తగ్గిపోతున్నది. ప్రతి అయిదింట నాలుగు కుటుంబాలకు లైఫ్ ఇన్సూరెన్సు లున్నవి; ఆ కుటుంభాలలో ఒకరికో, ఇంకా ఎక్కువ మందికో రిటైరుమెంటు పాలసీలు వున్నాయి.

జీతగాళ్ళకంటె కూడా తక్కువ ఆదాయాలు వున్న ఒక మధ్యతరగతి వ్యాపారస్తులు వుండడం, నిపుణుడైన కార్మికుడు ఒక సంఘం చిన్న యజమానితో సమానంగా జీతం సంపాదించడం, పెట్టుబడి ధనానికి వచ్చే లాభాలను కార్మికులకు పంచడం, గ్రామాలలో జీవన ప్రమాణం నగరాలలో జీవన ప్రమాణస్థాయికి రావడం—ఇవన్నీ జరగడం అబ్బురం కాని దేశంలో తర తమ వర్గాలున్నవని ఎవరూ వేలెత్తి చూపలేరు; ఇతర ప్రజాస్వామిక దేశాలలో తర తమ భేదాలు బహిరంగం గానే కనిపిస్తున్నాయి. డిక్టేటరుషిప్పు దేశాలలో అవి తెరమరుగున వున్నాయి. ఆ దేశాలలో వున్నట్లు అమెరికాలో వర్గవిభేదా లున్నాయని ఎవరూ అనలేరు. అయితే, విభిన్నప్రయోజనాలను కాంక్షించే వర్గాలమధ్య విభేదాలు లేకపోలేదు; కాని, చాలా ఇతర పారిశ్రామికదేశాలలో వున్నంత తీవ్రమైనవీ, శాశ్వతమైనవీ కావివి. ఇతరదేశాలలో ఉత్తమ, మధ్యమ, అధమ తరగతులంటూ తేడాలు

వుంటే, ఇక్కడ అందరికంటె హెచ్చుమంది వున్న మధ్యతరగతివారిలో మీదివారు, మధ్యవారు, క్రిందివారు అని త్రిగ్రీలలో తేడాలున్నాయి.

## అమెరికా ఆర్థిక వ్యవస్థ కూర్చిన ప్రయోజనం

సత్యాన్వేషణ అమెరికాలో భౌతిక సంపదలు అపరిమితంగా వున్నాయి గను కనే, దానిలో మరే దేశంలోను లేనన్ని యూనివర్సిటీలు, లైబ్రరీలు, పరిశోధనాలయాలు మొదలైనవి వున్నాయి. అయితే, సత్యాన్వేషణ పరమాశయంగా గలవారికి అమెరికాలో కనిపించే వాటిలో ఇది ఒక అంశం మాత్రమే. ఇంతకంటె ముఖ్యమైన మరొక అంశం వుంది. స్వతంత్ర ఆర్థిక విధానం చలవ ఫలితంగా, ఇతరుల అభిప్రాయాలతో ఏకీభవించలేని వారు సయితం బ్రతకడానికి అవకాశాలున్నాయి దీనిలో. అమెరికాతో సహా అన్ని దేశాలలోను మతంలోగాని, రాజకీయాలలోగాని, చివరకు సాహిత్యం, కళలు మొదలైనవాటిలోగాని కొత్త దారులు తొక్కేవారికి నిలవ నీడ వుండడం కష్టం; అయితే, ఆర్థిక స్వేచ్ఛావిధానం వున్నదేశంలో అటువంటివారు తమ యిష్టాను సారం బ్రతకడానికి హెచ్చు అవకాశాలుంటాయి. అల్లాగనిచెప్పి, ఆర్థికస్వేచ్ఛా విధానంలో దేనికి ప్రోత్సాహం వుంటే అదంతా మంచిదని అర్థం కాదు గాని, గుట్టల కొలదీ మట్టి త్రవ్వితేగాని ఒక రత్నం బయటపడనట్లు, అనేక తప్పులు జరిగితేగాని ఒక ఒప్పు జరగదు. అమెరికాలో తమ రాజకీయాభి ప్రాయాలవల్ల ఉద్యోగాలు పోగొట్టుకొన్నవారు వ్యాపారం చేసుకోవచ్చు; అధిక సంఖ్యాకులకు ఇష్టంలేని మతాభిప్రాయాలు కల రైతుల భూములను ఇక్కడ ఎవరూ లాక్కోలేరు. యూదులు తాము తూర్పు యూరపులో తిలో దకా లిచ్చిన సంస్కృతిని అమెరికాలో పునస్సృష్టి చేసుకోగలరు.

విద్యాబోధ ఇంకా అమెరికా సమాజంలో లీనం కాకుండావున్న కొన్ని చిన్న వర్గాలవారు, మతిభ్రష్టులు మొదలైనవారు తప్ప. 6—14 సంవత్స రాలమధ్య వయస్సువున్న పిల్లలందరూ ప్రాథమిక పాఠశాలల్లో చదువుతారు.

పెద్దపిల్లల్లో నూటికి 80 వంతులమంది 18వ ఏడు వచ్చేవరకు మాధ్యమిక విద్యాలయాలలో చదువుతారు. యువతీయువకులలో సుమారు నాలుగవవంతు మంది (కొన్ని రాష్ట్రాలలో ఈ సంఖ్య అప్పుడే మూడవవంతు అయింది) 22 ఏళ్ళు వచ్చేవరకు ఉన్నత విద్యాలయాలలో చదువుతారు; వీరిసంఖ్య ఇంకా పెరుగుతూంది. ప్రాథమిక విద్యాలయాలలోను, మాధ్యమిక విద్యాలయాలలోను చదువు పూర్తిగా ఉచితం (ఒక్కొక్క బాలుని నిమత్తం సాలుకు 300 డాలర్లు ఖర్చవుతాయి). వీటికయ్యే ఖర్చులను పన్నులిచ్చేవారు భరిస్తారు. అన్ని విద్యాలయాలలో అన్ని క్లాసుల విద్యార్థులూ ఉచితంగా చదువుకోవాలనే ఉద్దేశంతో అమెరికనులు ప్రయత్నాలు చేస్తున్నారు.

ఈనాడు అమెరికాలో 2,80,000 చర్చిలు వున్నాయి; 2,00,000 చర్చిలూ మంది మతబోధకులున్నారు; 9 కోట్లమంది సభ్యులు గల మతసంఘాలున్నాయి. చర్చిలకు వచ్చే ఆదాయమంతా మతసంఘాలసభ్యులు యిచ్చేదే. మతవ్యవస్థకు ప్రయివేటువ్యక్తుల తోడ్పాటు కలిగించే ఈ స్వేచ్ఛావ్యాపారం, ప్రభుత్వానికీ, చర్చిలకూ సంబంధంలేకుండా చేసింది; తద్విధంగా అది మతస్వేచ్ఛను శక్తిమంతం చేసింది; ప్రజలు తమ ఆత్మాభీష్టాన్ని అనుసరించి దైవప్రార్థన చేసుకోడానికి కూడా అది తోడ్పడింది.

ప్రెసిడెంటు ఐసెన్‌హోవరు చెప్పిన మాటలివి: సైన్సు అభివృద్ధి "అనేక విషయాలలో ఫెడరల్ ప్రభుత్వవ్యయాలు తగ్గించబడగా, పరిశోధనలనిమిత్తం వ్యయాన్ని హెచ్చించి 250 కోట్ల డాలర్లుచేశాం. పరిశోధనలవలన మనకు ఇదివరకే అనేక నూతన పరిశ్రమలు, వస్తువులు లభించాయి; పరమాణుశక్తి, రేడియో ఐసొటోపులు, ఎలక్ట్రానిక్స్, హెలికాప్టర్లు, జెట్ ఇంజనులు, టిటేనియం మొదలైన అనేకవస్తువులు ఈ పరిశోధనలవల్ల కొత్తగా లభించినవే." ఇంతేకాదు; ప్రయివేటు పారిశ్రామికులు 150

కోట్ల డాలర్లు మొదలుకొని 200 కోట్ల డాలర్లవరకు పరిశోధనల నిమిత్తం ఖర్చు చేస్తారు. అందుచేత, పరిశోధనలలో ఒకప్పుడు పశ్చిమ యూరప్ దేశాలకు వున్న అగ్రస్థానం అమెరికాకు సంక్రమించినదంటే ఆశ్చర్యం లేదు.

పుస్తక ప్రచురణ ఇటీవల సంవత్సరం వొకటికి 50 కోట్ల పుస్తకాలకు పైగా అమ్ముడయాయి. చదువగల వయస్సువున్న మనిషి వొకనికి సుమారు అయిదారు పుస్తకాల చొప్పున కొన్నాడన్నమాట. 7408 పబ్లిక్ లైబ్రరీలలో 15 కోట్ల గ్రంథాలున్నాయి, వీటిని సాలీనా సగటున 2 కోట్ల 50 లక్షలమంది ఉపయోగిస్తారు. 1952 లో సుమారు 2,000 దినపత్రికలు, సుమారు 9,000 వార వార్తాపత్రికలు కలిపి మొత్తం 7 కోట్ల 10 లక్షల కాపీలు అమ్ముడుపోయాయి. ఇవికాక, పెద్ద పేరున్న 50 వార, మాసపత్రికలు పది కోట్ల కాపీలకు పైగా అమ్ముడయాయి.

మ్యూజియములు, నాటక శాలలు మొదలైనవి అమెరికాలో మరే దేశంలోనూ లేనన్ని మ్యూజియములున్నాయి; వాటిలో కొన్ని అద్భుతమైనవి; మిగిలినవి ఒక మాదిరిగా వుంటాయి; మొత్తంమీద అన్నింటికీ విశేషంగా జనం వస్తూంటారు. అమెరికాలో 1,60,000 మంది గాయకులున్నారు; ఆర్కెస్ట్రాయే వృత్తిగాగల 200 కు పైగా సింఫొనీ ఆర్కెస్ట్రాలున్నాయి. (గత 15 సంవత్సరాలలోగా సింఫొనీ ఆర్కెస్ట్రాల సంఖ్య రెట్టింపు అయింది); అమెచూర్‌లతో కూడిన 800 ఆర్కెస్ట్రాలున్నాయి. నటీనటులు మొదలైనవారు 50,000 మంది వున్నారు; నాటకశాలలు చాలా తక్కువగా వున్నట్లు ప్రజలు విచారపడుతూంటారు: అయితే, అమెచూర్ నటీనటులు ప్రదర్శనలిస్తున్న నాటకశాలలు 2,000 ఉన్నాయి.

ఫౌండేషనులు విద్యాభివృద్ధికి, శాస్త్ర కార్యకలాపాలకు ప్రయివేటు వ్యక్తుల అధీనంలో వుండి, ఒక్కొక్కదానికి పది లక్షల డాలర్లకు

పైగా ఆస్తి పాస్తులున్న ఫౌండేషనులు (ధర్మసంస్థలు) 60 వున్నాయి; కాని. అమెరికాలో వున్న మొత్తం ఫౌండేషనులకు 2,500 కోట్ల డాలర్లకుపైగా ధనం వుంది. 10 లక్షలడాలర్లకుపైగా విరాళాలువచ్చే ప్రయివేటు ఉన్నతవిద్యాలయాలు ప్రస్తుతం 300 కు పైగా వున్నాయి. వీటి ఫలితంగా ఏమి జరుగుతున్నదంటే, శాస్త్రపరిశోధనలు మొదలైన విషయాలలో ఈ సంస్థలు స్వేచ్ఛగా కృషిచేయ డానికి వీలవుతూంది; అమెరికాకంటె తక్కువ ధనవంతమైన దేశంలోగాని, విద్యా సంస్థలను ప్రభుత్వం కంట్రోలు చేసే దేశంలోగాని ఈ విధంగా కృషి జరగడం అసాధ్యం. అయితే, ఈ సంస్థలు సొంతంగా చేసేవన్నీ మంచి వని గాని, అవి జరిపే పరిశోధనలన్నీ విజయవంతమవుతాయనిగాని అర్థం కాదు; కాని, తప్పొప్పులవలన అభివృద్ధి సాధ్యమవుతుంది.

యూరపియనులు అమెరికా ప్రస్తావన రాగానే అక్కడి నియంతృత్వం మైనారిటీ వర్గాలసమస్యలను, దక్షిణాదిన వున్న జాతి విచ మీద పోరాటం క్షణా సమస్యలను, మెకార్థిజం మొదలైనవాటిని ఎత్తుకుం టారు; అమెరికనులందరూ ఈ తప్పులు చేస్తున్న వారిలాగ వారు మాట్లాడుతారు. (రాజ్యాంగ చట్టం, ప్రజాస్వామిక విధానంకూడా సన్మార్గులకు కాపుదలగా వున్నట్టే దుర్మార్గులకు కూడా కాపుదలగా వుండి, తరచుగా మందగమనంతో అభివృద్ధి జరిగేటట్లు చేస్తాయనే సంగతి వారు మరచిపోయి మాట్లాడుతారు). అమెరికా—యూరప్ సంబంధాలను గురించి మనం ఆలోచించినప్పుడు మనకు ఎంతమాత్రం ఇష్టంగా వుండని ఒక విషయాన్ని జ్ఞాపకం తెచ్చుకుంటాం: అది, యూరపియన్ దేశాలు యుద్ధ నష్టపరిహారాలను చెల్లించడం, ఒక మిత్రరాజ్యానికి మరొక మిత్ర రాజ్యం బాకీ పడడమున్నూ; వీటి వలన యూరప్ దేశాల ఆర్థిక వ్యవస్థలు గజి బిజిగా వుండడం మనకు కనిపిస్తుంది; 1920 లగాయతు అమెరికా ప్రభుత్వం అనుసరించిన తప్పుడు విధానాల వలన ఇలాగ జరిగిందని అనుకుంటాం;

ప్రథమ ప్రపంచ యుద్ధ బీభత్సం పిమ్మట యూరపియన్ రాజ్యాలు కొంచెం కోలుకొనేసరికి ఆ కొంచెంకూడా 1929 లో వచ్చిన కల్లోలంతో నాశనం కావడం, తత్ఫలితంగా 1930 తరువాత జర్మనులు నాజీ మూఢావేశంలో పడడం మనకు గుర్తుకు వస్తుంది. కాని, యూరప్‌లో వున్న అభివృద్ధి నిరోధకులవంటివారే కొందరు అమెరికాలో వున్నారనీ, వారే అమెరికాలో జరిగిన అపచారాలకు కారకులనీ మనకు తెలియదు; లేదా, అది దాచేసి మాట్లాడుతాం; అమెరికాలో అభివృద్ధి నిరోధకులు ఒకవేళ హెచ్చుమంది వుండి, అప్పుడప్పుడు వారు పలుకుబడి గలిగివున్నప్పటికీ, అమెరికా ప్రజలలో ముఖ్యంగా ఉన్న లక్షణం ఉదార స్వభావంగాని, అభివృద్ధి నిరోధకత్వం కాదనీ, తాతలనాటినుంచీ అమెరికనులు మానవ స్వేచ్ఛను కాపాడడానికి ప్రయత్నిస్తున్నారనీ మనకు తెలియదు; లేదా, అది దాచేసి మాట్లాడుతాం. అమెరికనులు స్వీయ ఉదార సాంప్రదాయ ప్రేరితులై గత నలభై సంవత్సరాలలో మూడుసార్లు యూరప్ స్వేచ్ఛను కాపాడారు: (1) 1916 లో విల్సన్ ప్రెసిడెంటు కావడానికి 90 లక్షలమంది అమెరికనులు వోట్లు వేశారంటే మిత్రరాజ్యాలకోసం వోట్లు వేశారన్నమాట; జర్మనీకి జయం కలుగుతున్న రోజులలో అమెరికా యుద్ధాన్ని ప్రకటించింది; ప్రథమ ప్రపంచ యుద్ధగతి 1918 వ సంవత్సరం వేసవికాలంలో మారిపోడానికి అమెరికన్ సైనికులు ఎంత కారణమో, అమెరికన్ పరిశ్రమలు కూడా అంత కారణం; (2) ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో మిత్రరాజ్యాల మొత్తం సైనికులు ఎందరున్నారో అమెరికా అంతమంది సైనికులను పంపింది; కుడిపక్షం నియంతృత్వాలను నాశనం చేయడానికి మొత్తం ఎంత వ్యయమైందో దానిలో సగానికి పైగా అమెరికా ఖర్చు చేసింది; (యూరప్‌లోని నియంతలు, వారి ఆసియా మిత్రులు తుది విజయాన్ని దగ్గర దగ్గరగా సాధించిన సమయం ఒకప్పుడు ఆసన్నమైనదనే విషయాన్ని మనం మరచిపోయాం...) (3) సోవియెట్ సామ్రాజ్య సైన్యాలను ప్రతిఘటించగల సైనిక బలాన్ని 1947 నుంచీ

నిర్మించుకుంటున్న దేశం అమెరికా ఒక్కటే; అలాగ చేస్తూ కూడా వామపక్ష నియంతృత్వంలో ఉన్న ఇంపీరియలిష్టు రాక్షసిని నిరోధించడానికి సుమారు 30.000 కోట్ల డాలర్లను ఖర్చు పెట్టింది. అమెరికా అటువంటి ప్రయత్నాలే చేసి వుండకపోతే ఈపాటికి తృతీయ ప్రపంచ యుద్ధోపద్రవం సంభవించి వుండేది; ఈపాటికి మొత్తం యూరప్‌ను సోవియెట్ రష్యా ఆక్రమించుకొని వుండేవి. అరువు—కొలు రూపంలోను, ఇతర రూపాలలోను 1941-1956 మధ్య అమెరికా ఇతర దేశాలకు సుమారు 10,000 కోట్ల డాలర్ల ధనసహాయం చేసింది; అమెరికనులు ఇదంతా స్వదేశంలో ఖర్చు పెట్టుకొని సుఖంగా వుండవచ్చుగదా.

## లోపాలోపాలు

అమెరికన్ కాపిటలిజంలోని లోపాలోపాలు ఇవి: ప్రయోజనాలు అస్థిరత్వం, అభివృద్ధి; దురాశ, విశాలబుద్ధి. అమెరికన్ కాపిట లిజంలోని లోపాలను ప్రయోజనాలతో సరిపుచ్చాలి. యూరపియనులతో కూడిన జాతికీ, వారి సంతతికీ ఆ కాపిటలిజం భౌతిక ప్రయోజనాలను కూర్చి, వారు యూరప్‌లో వుంటే కలిగే కంటె ఎక్కువ సౌఖ్యం కలుగజేసింది. అమెరికన్ జాతికి సంభవించే దుర్భర సమస్యలు పరిష్కారం కావడానికి అది మూలకారణమైంది; ఆధునిక ఉదార ప్రపంచ ఆశలను నెరవేర్చే సంస్థలను పటిష్ఠం చేయడానికి అది తోడ్పడింది; అమెరికాకు స్వేచ్ఛ కోసమో, సౌఖ్యం కోసమో, రెండింటికోసమో వచ్చిన నాలుగు కోట్లమంది యూరపియన్ వలసదారులు అమెరికన్ సమాజంలో లీనమై పోడానికి తోడ్పడిందిది; వీరిలో అనేకులు స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం వంటివి వున్నవంటూ కూడా తెలియనివారు; 250 సంవత్సరాలు పీడించిన బానిసత్వాన్ని నిర్మూలించడానికి తోడ్పడిందిది. (మరీ దక్షిణాన బానిసత్వ నిర్మూలన కాండ ఇంకా పూర్తి కాలేదు). సాంప్రదాయ, జాతీయ, కమ్యూనిస్టు తత్వాల

సంయుక్త పదాఘాతానికి నలిగిపోతున్న యూరపియన్ దేశాలలో ఇప్పుడు వ్యక్తి స్వేచ్ఛ అడుగంటుతూంది గనుక, ఇప్పటికీ నిలచి ఉన్న ఉదారత్వానికీ, ప్రజాస్వామ్యానికీ అమెరికాయే రక్ష; అమెరికానుంచి ఈ ఉదారత్వ ప్రజాస్వామ్యాలు ఒకనాటికైనా పురోగమనం ప్రారంభించ వచ్చు.

ఒత్తిడి కాపిటలిజం వలన అమెరికాకు కలిగిన ఒత్తిడి తీవ్రమైనదనడం నిజం. (కాని, ఈ ఒత్తిడికి తాళలేనివారు నిరంకుశత్వం క్రిందవుండి శాంతిని పొందవచ్చు!) పోటీ తక్కువగా వుండాలనీ, స్థిరత్వం ఎక్కువగా వుండాలనీ కాంక్షించే వ్యాపారస్థులు చాలామంది వున్నారు. ప్రతివారం వారు జీతాలక్రింద ఇవ్వవలసిన ధనం గురించి తల్చుకుంటే గుండె బేజారెత్తుతుంది; సకాలంలో అంత ధనం వస్తుందా? తగినంత ధనం చేతికి అందకపోతే బ్యాంకు సాయపడుతుందా? మరింత భద్రతకోసం, మరింత దీర్ఘకాలపు కాంట్రాక్టులకోసం, పనులు నిల్పుకొనడం కోసం కొన్ని స్వప్రయోజనాలను వదలుకోడానికి ఇష్టపడే కార్మికులు అనేకమంది వున్నారు. రైతులు కొన్ని స్వప్రయోజనాలను ఇదివరకే వదలుకున్నారు—ఫెడరల్ ప్రభుత్వం ధాన్యాదులకు నిర్ణయించే ధరలకు వారు సమ్మతించారు. అమెరికన్ కాపిటలిజం మొత్తాన్ని దృష్టిలో పెట్టుకుచూస్తే అది మంచిదని ఎవరైనా చెబుతారు. కాని, ఈ ఆర్థిక వ్యవస్థలోపల విశేషంగా ఆందోళనకర పరిస్థితులు, ఉద్రిక్తత కలిగించే పరిస్థితులు వున్నాయి.

తుపకు భద్రత భద్రతను నాశనంచేయడం నియంతృత్వ లక్ష్యం; అయితే, అది వెంటనే భద్రత కలిగిస్తానని ఘంటాపథంగా చెబుతుంది. స్వేచ్ఛ వలన కొలదికాలానికి భద్రత ఏర్పడుతుంది; కాని, తరచుగా దాని వలన తక్షణ భద్రత లభించదు. స్వేచ్ఛా వ్యవస్థలో బయలుదేరే అనేక గొడవల మధ్య పౌరుడు వుంటాడు గనుక, అది బానిస వ్యవస్థకంటె ఉత్తమమైనదనే సంగతి అతడికి గ్రహింపు కావడం కష్టం. నిరంకుశత్వం క్రింద

వున్న సమాజంలోకంటె ప్రజాస్వామ్యం క్రింద వున్న సమాజంలో జీవించ డానికీ, ఆర్థిక బానిసత్వ వ్యవస్థలోకంటె ఆర్థికస్వేచ్ఛా వ్యవస్థలో పనులు చేసు కోడానికీ ఉత్తమసంస్కారం కావాలి. మొత్తం యూరపియనులు ఆర్థిక స్వేచ్ఛను విడనాడడానికి నిశ్చయించుకున్నారు; ఒత్తిడులను సహించగలిగి నంత ఓపికలేదు వారికి. ఆ సహనం అమెరికనులకు వున్నట్టు కనిపిస్తుంది. బౌద్ధికంగా, మానసికంగా అమెరికనులు వెనుకపడ్డ వారంటూ, పెద్దరికం ఆపాదించుకొని చులకనగా మాట్లాడే యూరపియన్ బౌద్ధిక జీవులూ, ఆసియా బౌద్ధికజీవులూ అమెరికనులలో ఈ సహన శక్తి వుందని గ్రహించాలి.

ఆర్థికంగా, లేదా రాజకీయంగా సయితం ఆర్థికంగా అమెరికాతో అమెరికాతో ముడిపడి వున్న దేశాలకు కూడా దాని ముడిపడిన ఇతర దేశాలు తోపాటు ఒత్తిడి కలుగుతూ వుంటుంది. అమెరి కాలో ధరలు హెచ్చినా తగ్గినా వాటిప్రభావం విదేశీయులకుకూడా-కొనేవాడికి, అమ్మేవాడికి, లేదా అప్పు తీసుకొనేవాడికి—తగులుతుంది ; అమెరికన్ విధా నాలవల్ల ఆ విదేశాలలో కలిగే మార్పులు, వాటిలో స్వతహాగా కలిగే మార్పులకు తీసిపోవు. అమెరికాలో దారిద్ర్యం ఏర్పడితే ప్రపంచంలో మూడింట రెండు వంతులలో దారిద్ర్యం ఏర్పడుతుంది; అమెరికాలో డబ్బు బాగా ఆడుతూంటే ఆ రెండు వంతుల ప్రపంచంలోకూడా ఆడుతూ వుంటుంది. అందుచేత ఈ రెండు సందర్భాలలోనూకూడా ప్రపంచంలో మూడింట రెండు వంతులలో మార్పులు రావడం, పరిస్థితులు బహుశా బాధాకరంగా వుండడం జరుగు తుంది. అమెరికా విధానాన్ని విదేశీయులు తెగనాడడానికిముందు వివేచనతో దానివలన కలిగే లాభాలను, నష్టాలనుకూడా పరిశీలించడానికి ప్రయత్నించాలి.

అమెరికా ఆర్థిక వ్యవస్థ వలన ఉత్పత్తి, వినిభౌతిక సంపదకు యోగాల విషయంలో కలిగిన ఫలితాలను పురస్కరించు ఉత్తమ విధానం కొని విలువకట్టేవారు భౌతికవాదులు మాత్రమే.
ఆర్థిక స్వేచ్ఛావ్యవస్థలో ఒత్తిడి వుండడంతోపాటు, మరి

కొన్ని విషయాలు కూడా వున్నాయి. వీటినిగురించి యోచించడం అవసరం. వస్తువుల ఉత్పత్తిలోను, సంఘం కట్టుబాట్లలోను, భౌతిక సంపదలోను మాత్రమే కాక ఆధ్యాత్మిక భావాలలో సయితం మార్పులు రావడానికి వీలున్న వ్యవస్థ వలన ప్రయోజనాలూ కలుగవచ్చు, బాధలూ కలుగవచ్చు. చటుక్కున కలిగే మార్పులు ఎన్నో కష్టాలు తెచ్చిపెడతాయి; మానసిక లోపాలున్న వారి లెక్కలను, ఉన్మాదుల లెక్కలను తీసి చూస్తే ఇందుకు నిదర్శనం కని పిస్తుంది. కుర్రవాళ్ళను స్వశక్తిమీద ఆధారపడవలసిందని తరచు వదలివేస్తారు. అలాగ స్వేచ్ఛ ఇవ్వడం చాలామంది పిల్లలు వృద్ధిలోకిరావడం జరుగుతూ వుంటుంది; మిగతావారికి అది అనర్థదాయకం కాగలదు. ఉత్తమ స్థితికి రావ డానికి తంటాలు పడేవాడు ఎన్నో కష్టాలను ఎదుర్కోవలసి వుంటుంది. అమెరికా ఆర్థికజీవనం కోమల శరీరులకుగాని, అతి సున్నిత మనస్కులకు గాని పనికిరాదు. కాని, ఎవరైనా ఒక విషయాన్ని మాత్రం ఖాయంగా గ్రహించాలి : సోషలిస్టులు, అనేకమంది తదితరులు వాదిస్తున్నట్టుగా అన్నింటికంటె ప్రధానంగా కావలసింది భౌతిక సంపదే అనుకున్నప్పటికీ (ఇది వారి వారి అభిప్రాయంలెండి), తక్కిన విధానాలన్నింటికంటె అమె రికన్ విధానం నిస్సందేహంగా ఎక్కువ ప్రయోజనాలు కలిగించగలది.

---

# V అమెరికాలో జరిగినపద్ధతి

సంగ్రహం—అమెరికా విజయానికి కీలకం—గతంవలన కలిగినపాఠం—ఉన్నత వర్గం అదృశ్యం—శ్రామికవర్గం తగ్గుదల—శ్రామికులేగాని, శ్రామికవర్గం కాదు—సమానత్వ తత్వం—ప్రత్యేక సౌకర్యాల రద్దుకోసం ఆందోళన—ఐకమత్యం—19 వ శతాబ్ద లక్షణాలు—గుత్త వ్యాపారాల రద్దుకోసం ఆందోళన—"ధనాన్ని మించినది కృషి"—కార్మికోద్యమం—ఇతర అంశాలు—లోపాలు, అభివృద్ధి, స్వేచ్ఛ.

అమెరికా విజయానికి కీలకం

అమెరికన్ ప్రజాస్వామ్యం శక్తిమంతమై, అప్రమత్తతతో వున్నటువంటిది; యూరపియన్ ప్రజాస్వామ్యం బలహీనమౌతూ నిద్రాణ స్థితికి వస్తూంది. ప్రజాస్వామ్యానికి ఏది ప్రధానమో (రాజకీయ స్వేచ్ఛ) కాపిటలిజానికి కూడా అదే ప్రధానం (ఆర్థిక స్వేచ్ఛ). యూరప్, అమెరికాలలో స్వేచ్ఛ పూర్వం ఎలా వున్నదో, ఇప్పుడెలా వున్నదో, భావిలో ఎలావుంటుందో పండితులు యోచించవలసి వుంది; అసంఖ్యాక కారణాలనుబట్టి అసంఖ్యాక ఫలితాలను కలిగించే పద్మవ్యూహం వంటి వ్యవస్థను సమగ్రంగా తెలుసుకోడానికి వారు ప్రయత్నించాలి. నాకు కనిపించినంతవరకు, 18 వ, 19 వ శతాబ్దాలలో యూరప్ విజయానికి ఏది మూలమో అమెరికా విజయానికి కూడా అదే మూలం. ప్రాచీన, మధ్య, ఆధునికకాలాల్లో స్వేచ్ఛ దిగజారడానికి ఏవి హేతువులో, ప్రాచీన, మధ్య, ఆధునిక కాలాల్లో ఆ స్వేచ్ఛ నిలబడడానికికూడా అవే హేతువులు. ఇదంతా స్వేచ్ఛా సమానత్వాల యథార్థ సంబంధంమీద ఆధారపడి వుంటుంది. కమ్యూనిస్టులు బూటక ప్రచారం చేస్తున్నట్లు, సమానత్వం అంటే స్వేచ్ఛ కాదు; సోషల్ డెమోక్రాట్‌లు, కార్మికవాదులు బూటక ప్రచారం చేస్తున్నట్లు, సమానత్వం వలన స్వేచ్ఛ విధిగా లభిస్తుందని లేదు. కాని, ఏ వొక వర్గంయొక్క ప్రత్యేక సౌక

ర్యాన్ని నిరోధించడానికి అవసరమైనంతగా సమానత్వం లేనిదే స్వేచ్ఛ మనజాలదు.

**గతంవలన కలిగినపాఠం**

ఒక వర్గానికో, కుటుంబానికో, చర్చికో, పార్టీకో, మైనారిటీకో, మెజారిటీకో వున్న ప్రత్యేక సౌకర్యం ఎంతటిదైనా సరే - అది నిర్మూలన కాగానే స్వేచ్ఛకు జయం కలుగుతుంది. స్వేచ్ఛా వ్యవస్థలను కాపాడాలంటే, ప్రత్యేక సౌకర్యాలున్న స్థానాలమీద తెరిపిలేని పోరాటం జరపాలి; అంతకంతకు ఎక్కువ సమానత్వం సిద్ధించేవరకు పోరాటం సాగించడం అవసరం. యూరపియన్ ఉదారవాదంలో సంస్కరణలు జరుగుతున్నంత కాలమూ అది బలీయంగా వుంది: ఈ సంస్కరణలు ప్రత్యేక సౌకర్యాలను రద్దు చేసి, సమానత్వాన్ని స్థాపించుకోడానికి జరిపిన చర్యలు కాక మరేమిటి? యూరపియన్ ఉదారవాదంలో సంస్కరణలు చెయ్యడం మానివేసిన తరువాత, లేదా స్వేచ్ఛా సమాజ సమస్యలను ఉదారవాదరీత్యా పరిష్కరించడం మానివేసిన తరువాత, దానికి పటుత్వం పోయింది. స్వేచ్ఛగా వుండాలంటే, స్వేచ్ఛా సంస్థలున్న స్వేచ్ఛా సమాజంలో ఇతోధిక సమానత్వాన్ని అపేక్షించేవారు బలపడడం అవసరం.

**ఉన్నత వర్గం అదృశ్యం**

1776 లో జరిగిన విప్లవం "నిజానికి ఒకే దెబ్బలో రెండు విప్లవాలు" అని ఫ్రెడరిక్ స్టెర్న్ తన "కాపిటలిజం ఇన్ అమెరికా" అనే గ్రంథంలో వ్రాశాడు: "మాతృదేశాన్ని (బ్రిటన్‌ను) ప్రతిఘటించడానికి జరిగిన విప్లవంతోపాటే సాంఘిక విప్లవం జరిగింది — 1776 లో వర్గ, కుల విభేదాలు వున్నమాట నిజం; అమెరికా సాంఘిక విప్లవం వాటిని పూర్తిగా నిర్మూలించింది." యూరప్‌లో ఉదారవాదం, ప్రజాస్వామ్యం తలయెత్తక పూర్వం అక్కడకూడా ఉన్నత వర్గాలవారున్నారు. గత మూడు వందల సంవత్సరాలలో వచ్చిన విప్లవాలు మార్పులు తెచ్చాయే గాని, అక్కడ ఉన్నత వర్గాలు లేకుండా



మొత్తం ఆర్థికవ్యవస్థ అభివృద్ధి కావడానికి ప్రతివ్యక్తీ స్వయంగా కృషిచేయడం చాలా అవసరం. తన కృషికి అత్యధిక ఫలితం పొందాలని ప్రతిమనిషీ ప్రయత్నిస్తాడు. హెచ్చు జీతాలకోసం కార్మికులూ, హెచ్చులాభాల కోసం వ్యాపారస్తులూ పయత్నిస్తూ ఉంటారు.

చెయ్యలేదు. కాపిటలిజానికి పూర్వంవున్న వ్యవస్థ ఆచారంగా వచ్చినట్లే, కాపిట లిజం కూడా ఆచారంగా ఆచరించబడింది. మధ్యవర్గంలో వుండి, సాహసంతో కృషిచేసినవాడు కాపిటలిస్టు అయాడు; కర్షకుడు పరిశ్రమలో కార్మికు డయాడు; ఈ రెండు వర్గాల మధ్య 1700 వ సంవత్సరంలో ఎంత వ్యత్యాసం వుందో 1900 వ సంవత్సరంలో కూడా అంత వ్యత్యాసమూ వుంది. అమె రికాలో అల్లాగ కాక, విప్లవం ఫలితంగా ఉన్నత వర్గం పలుకుబడి చాలా వరకు నశించింది; అంతర్యుద్ధం రోజులలో మిగతా పలుకుబడి నశించి, సమానత్వం కోరిన ఉత్తరాదివారికి విజయం లభించింది.

శ్రామికవర్గం ఒక కొనసాగుతున్న వర్గం రూపుమాసింది. పోతే, రెండవ తగ్గుదల కొనసాగుతున్న శ్రామిక వర్గానికి కూడా అలాగే జరిగింది. పారిశ్రామిక విప్లవం ప్రారంభమైనప్పటినుంచీ, ఇతర దేశాలలో కార్మికులు చేసిన పనులను అమెరికాలో అంతకంతకు ఎక్కువగా యంత్రాలచేత చేయించారు. కొంతమంది తరు వాత కొంతమంది చొప్పున సామాన్య కార్మికులకు విద్యగరపి, శిక్షణ నిచ్చి, వారిని అర్ధనిపుణ కార్మికులుగాను, నిపుణ కార్మికులుగాను క్రమంగా చేర్చు కొంటూ, వారి సంఖ్యలను పెంచుతూ వచ్చారు. అందువల్ల వారి ఆదాయాలు పెరిగాయి. దానితో వారు డబ్బు ఆదా చేసుకొనడం, సొంత ఆస్తిగలవారికి ఉండే స్వాతంత్ర్యాన్ని, భద్రతను పొంది, వారి స్థాయిలోకి వెళ్ళడం జరిగింది. చొరవ, తెలివితేటలు, కొంతవరకు అదృష్టం వున్న ఎవరైనా సరే, మేనేజర్ల స్థాయికి గాని, కాపిటలిస్టుల స్థాయికి గాని వెళ్ళడానికి ఎటు వంటి అభ్యంతరమూ లేదు; ఇంతగా వృద్ధిలోకి వచ్చినవారు మిగతావారితో పోలిస్తే చాలా తక్కువమంది వున్నారు; కాని, ఉన్నత స్థాయిలోకి వెళ్ళ డానికి అర్హత వుండాలిగాని అభ్యంతరాలు మాత్రం ఏవీ లేవనడానికి అలాగ వృద్ధిలోకి వచ్చినవారే నిదర్శనం. ఉన్నత వర్గాలవారు ఎంతమాత్రం పెద్ద పురుగులు కాలేని విధంగా చేసిన ఈ విధానం అమెరికాలో చాలా చోట్ల కార్మి

కులు వృద్ధిలోకి రావడానికీ, క్రింది తరగతి కార్మికులంటూ ఒక వర్గం పెరిగి పోకుండా చెయ్యడానికీ వీలిచ్చింది.

అమెరికా జనాభాలో పదవ వంతు మొదలుకొని, శ్రామికులే గాని, ఎనిమిదవ వంతువరకు ప్రజలు ఇప్పటికీ మిగతా శ్రామికవర్గం కాదు ప్రపంచకార్మికులున్న పరిస్థితులలోవున్నారు. వీరు దక్షిణాది రాష్ట్రాలలో వ్యవసాయ కూలీలుగా వున్న సీగ్రోలు; నైరుతి అమెరికాలో వున్న మెక్సికన్ వలసదారులు; అమెరికా సమాజంలో విలీనం అవని యూరపియనులు; ఫ్రెంచి కెనడియనులు; పోర్టోరీకనులు; పారిశ్రామిక నగరాలలో మురికిపేటల నివాసులున్నూ. ఈ శ్రామికులు శీఘ్ర గతిని పై మెట్టులలోకి వెళ్ళే పద్ధతులు ఆచరణలో వుండడంచేత వీరు ఒక శ్రామిక వర్గం కాలేదు; వలసదారులు విపరీతంగా వచ్చి, వీరి స్థానాన్ని ఆక్రమిస్తే తప్ప, అమెరికా ఆర్థిక రంగంలో శ్రామికులనేవారు బహుశా ఈ తరంలోనే కనిపించక పోవచ్చు.

అమెరికా జాతి పుట్టినప్పుడు ఉన్నత వర్గానికి చెందిన సమానత్వావారు లెక్కించవలసినంతమంది లేరు; శ్రామిక తత్వం వర్గంలోనివారు బహుకొలదిమంది వున్నారు. తరువాత, ఈ రెండు వర్గాలవారు పెరిగిపోకుండా ముఖ్యంగా తోడ్పడినది వారిలో ప్రగాఢంగా ఉన్న సమానత్వ భావం; ఈ భావమే అమెరికా స్వేచ్ఛాపథ లక్ష్యం. దానినే అమెరికనులు సంఘీభావమనీ, ఫ్రెంచివారు సౌభ్రాతృత్వమనీ అన్నారు. ఒక జాతి స్వేచ్ఛగా వుండాలంటే దానిలోని ప్రజలు నైతికంగా సమానత్వం కలిగి వుండాలని గత 180 సంవత్సరాలుగా అమెరికనులలో అధిక సంఖ్యాకులు భావిస్తున్నారనడంలో సందేహం లేదు. అయితే, ఈ ఆశయం ఇంకా పూర్తిగా నెరవేరలేదు. అనేక విభిన్న తెగలవారితో కలగూర గంపగా వుండి, దారుణమైన బానిసత్వం పారంపర్యంగా వుండి, చాలా భాగాల ప్రజల మనస్సులలో జాతి విభేదం వ్రేళ్ళు పాతుకొని వున్న జాతిలో సమానత్వం రావడం గట్టి పోరాటంవల్ల వస్తుందిగాని, శీఘ్రంగా

రమ్మంటే రాదు. అందుచేతనే, ఈ అనర్థాలు పీఠం వేసుకు కూర్చున్న ఆచారాలు, సాంప్రదాయాలు మొదలైనవాటిని సంస్కరించడానికి ఇప్పటికీ గట్టి పోరాటం జరుగుతూంది. సమానత్వం, జాతి విభేదం ఒకదాని కొకటి విరుద్ధమైనవని అమెరికనులకు తెలుసు; అందుచేత, జాతి విభేద భావాన్ని తమ చట్టాలద్వారా, రాజ్యాంగంద్వారా నిర్మూలించడానికి వారు ప్రయత్నిస్తున్నారు.

**ప్రత్యేక సౌకర్యాల రద్దుకోసం ఆందోళన**

అత్యంత స్వేచ్ఛగల సమాజాలలో ప్రత్యేక సౌకర్యాలు ఏర్పడడానికీ, వాటివలన నియంతృత్వం ఏర్పడడానికీ కారణ భూతమయే బీజాలుకూడా కనిపిస్తాయి. వీటిని అణచిపెట్టాలంటే నిరంతరం అప్రమత్తతతో ప్రవర్తించడం అవసరం. అమెరికాలో జరిగిన విప్లవం ప్రత్యేక సౌకర్యాలను ప్రతిఘటించడానికి జరిగినదే. యూరప్‌లో ఉదారవాద ప్రేరితమైన విప్లవాల వల్ల ఏమి జరిగిందో, అమెరికాలో విప్లవం విజయవంతం అవగానే అదే జరిగింది: విప్లవంలో పాల్గొన్నవారిలో కొందరు నూతన స్వేచ్ఛను తమ ప్రత్యేక సౌకర్యాలకోసం వినియోగించుకో దలచగా, మిగిలిన వారు అది వల్లకాదన్నారు; అందుచేత ఈ రెండు పక్షాలవారు ఘర్షణ పడ్డారు. 1786-87 లో షే జరిపిన తిరుగుబాటు, 1800 లో జఫర్సన్ ఎన్నిక, 1828 లో జాక్సన్ ఎన్నిక, వీటినిబట్టి రిపబ్లికన్ పార్టీలో మొదటి రెండు తరాలవారు ఎటువంటి స్థానంలోవున్నదీ స్పష్టంగాతెలుస్తూంది. (షే తిరుగుబాటును "యుద్ధ భూమిలో మాత్రం అణచివేయగలిగారు. కాని, తిరుగుబాటుదారులు తమ సిఫారసులను ప్రభుత్వం అమలులో పెట్టినందుకు వారు సంతృప్తి పడ్డారు!" అని రిచర్డ్ మోరిస్ వ్రాశాడు. జాక్సన్‌కు వోట్లు ఇచ్చినవారి నినాదం ఇది: "అందరికీ సమాన హక్కులుండాలి; ఎవరికీ ప్రత్యేక సౌకర్యాలు వుండరాదు"). అమెరికనులు ప్రత్యేక ప్రయోజనాల నిర్మూలన కాండను సాంఘిక సంబంధ బాంధవ్యాలలోకంటె ఆర్థికరంగంలో ఎక్కువ విజయవంతంగా చేశారు. ఆస్తి పాస్తులమీద కొలదిమందికి గుత్తవున్నప్పుడూ, లేదా, ఆర్థికంగా ఉన్నత

స్థితిలోవున్న ఒక వర్గంవారు మిగిలిన వారిని పైకి రాకుండా చేసినప్పుడూ ఆర్థిక స్వేచ్ఛ అంతరిస్తుంది. అందువలన, స్వేచ్ఛను కాపాడాలంటే ఎవరికీ ప్రత్యేక సౌకర్యం లేకుండా చెయ్యాలి; అమెరికాలోని కాపిటలిజానికి, ఇతర కాపిట లిజాలకు ప్రధానంగా వున్న తేడాను ఆర్థిక ప్రయోజనాల విషయంలో అమెరికా అవలంబించిన వైఖరి వ్యక్తపరుస్తుంది.

కాపిటలిజానికి వున్న కీలక లక్షణం స్వార్థపర్వతమని ఐకమత్యం దానిని విమర్శించేవారంటారు. కార్మికుడైతే అత్యధిక వేత నమూ, వ్యాపారస్తుడైతే అత్యధిక లాభమూ, మరొకడైతే మరొక అత్యధిక ప్రయోజనమూ, ఈ విధంగా ప్రతి మనిషీ తన ప్రయత్నాలకు అత్యధిక ఫలితాన్ని పొందాలనుకున్న ట్లయితే మొత్తం ఆర్థిక వ్యవస్థకి ముమ్మాటికీ మంచిది. అంతేకాక, ఎవరికి వారు స్వార్థపరులవడంవల్ల, ప్రతివొక వర్గానికీ స్వార్థపరత్వం వుండడం వల్ల, కాపిటలిస్టు దేశాలలో (కాపిటలిజంతో సంబంధంలేని దేశాలన్నిటిలోనూ అని కూడా అనవచ్చు) అమిత ఆందోళనకర సంఘటనలు జరిగాయనడం ముమ్మాటికీ నిజం. అమెరికాలో అనేకమందికి సమానత్వ భావం వున్నందున స్వార్థపరత్వం తలెత్తలేక, బహుశా మరే పెద్ద పారిశ్రామిక దేశంలోనూ ఏర్పడ నటువంటి పరిస్థితి ఏర్పడింది. తనకు పోటీగా వున్నవాడు నశించాలనుకోవలసిన వ్యాపారస్తుడే ప్రజలలో సంఘీభావాన్ని పెంపొందించే అన్ని రకాల పనులకూ అన్ని దశలలోనూ ప్రోత్సాహమిస్తున్నాడు—ఏ చిన్న పల్లెలోని పనికైనా సరే, జాతిమొత్తానికి సంబంధించిన పనికైనా సరే అతడి ప్రోత్సాహం వుంటుంది; స్కూళ్ళు, ఆస్పత్రులు, ఆట స్థలాలు, లైబ్రరీలు, నాటక శాలలు మొదలైనవన్నీ వారి డబ్బుతో నిర్మించబడ్డాయి; వారే వాటిని పోషిస్తున్నారు. వ్యాపారస్తుల సంఘాలలో అత్యధిక భాగం కేవలం క్లబ్బులో, తమ వ్యాపార విషయాలు మాత్రమే చర్చించుకొనే స్థలాలో కావు: అవన్నీ కూడా స్థానిక వ్యవహారా లన్నింటిలోనూ శ్రద్ధ పట్టి పనిచేస్తున్నటువంటివి. కాపిటలిజంయొక్క మూల

సూత్రాన్ని బట్టి చూస్తే ఇది అసాధ్యమని అనవచ్చు: మానవునిలో వివిధ లక్షణాలు వుంటాయనే విషయాన్ని జ్ఞాపకం వుంచుకోవాలి; మానవునిలో అతి స్వార్థపరత్వమూ, అతి పరహితాపేక్ష కూడా వుంటాయి. ఇతర దేశాల వ్యాపారస్తులంతగానూ అమెరికన్ వ్యాపారస్తులు కూడా స్వప్రయోజనపరులే కావచ్చుగాని, వారు స్వప్రయోజనం కోసం చేసిన పనులు స్వార్థపరత్వాన్నీ, పరహితాపేక్షనూ కూడా చాటుతున్నాయి. అందరూ క్షేమంగా వున్నప్పుడే తమకు క్షేమం వుంటుందనే స్వార్థపరత్వం వారిది. ఈ లక్షణంవలన ఇతరులతో వారి సంబంధాలు సాఫీగా వుంటాయి.

19 వ శతాబ్ద లక్షణాలు

అందుచేత, ఇప్పటి అమెరికన్ జాతి, అమెరికన్ కాపిటలిజం వెలుగొందడానికి ముఖ్యంగా మూడు అంశాలు కారణమయాయి. ఆ మూడు ఇవి: (1) ఉన్నత వర్గం అనేది లేకపోవడం, లేదా, ఇంచుమించు లేకపోవడం; (2) శ్రమజీవులు తక్కువ మంది వుండి, వారు తరచు పై స్థాయిలలోకి వెడుతూండడంచేత శ్రామిక వర్గమంటూ ప్రత్యేకంగా ఒక వర్గం బలపడకపోవడం; (3) సంఘీభావం వుండాలనే ప్రగాఢ వాంఛతో వెల్లివిరిసిన సమానత్వ భావం వుండడం. 19 వ శతాబ్దంలో—ముఖ్యంగా 1880 నుంచి 1890 లోపల వృద్ధి అయిన మరొక మూడు లక్షణాలను వీటికి చేర్చవచ్చు. ఆ సమయంలో అమెరికన్ కాపిటలిజానికి ఆచరణలోనేమి, దాని పోకడలలోనేమి, ఫలితాలలోనేమి యూరపియన్ కాపిటలిజంతో చాలా పోలికలున్నాయి. ఆ తరువాత ఇవి ఒకదానినుంచి మరొకటి దూరమై, రెండు తరాల తరువాత ఈ రెండింటిమధ్య పోలిక లేకుండా పోయింది.

గుత్త వ్యాపారాల రద్దుకోసం ఆందోళన

19 వ శతాబ్దం చివరి పాదంలో అమెరికన్ ఆర్థిక రంగంలో గుత్త వ్యాపార లక్షణాలు బయలుదేర నారంభించాయి. బ్రిటన్, జర్మనీ, ఫ్రాన్సులలోలాగ పెద్దపెద్దకంపెనీలు బయలుదేరాయి; కొన్నికంపెనీలు ఒకే పెద్ద కంపెనీగా

కలిసిపోయాయి; మరెవరూ వాటిముందు పోటీకి నిలవలేనంత బ్రహ్మాండమైన కంపెనీలు అనేక పరిశ్రమలను హస్తగతం చేసుకున్నాయి; పోటీ కంపెనీలను పడగొట్టి, లాభాలన్నీ తామే తినివేయాలన్నంత రాక్షస ఆకలిగల కంపెనీలు ఇవి. ఈ కంపెనీల స్థాపనపట్ల కొన్ని సంఘాలు ఆందోళన చేశాయి. ఆ సంఘాలు ఎన్నడూ అధికారంలోకి రాలేకపోయినప్పటికీ, గుత్త వ్యాపారాలంటే వాటికి వున్నంత అసహ్యం డెమోక్రాట్లకూ, రిపబ్లికన్లకూ కూడా కలిగింది. తత్ఫలితంగా కాంగ్రెసు 1887 లో ఇంటర్ ఎస్టేట్ వ్యాపార చట్టమూ, 1890 లో గుత్త వ్యాపార రద్దు చట్టమూ చేసింది. గుత్త వ్యాపార రద్దు చట్టంలో ఇలా వుంది: "అమెరికాలోని వివిధ రాష్ట్రాల మధ్య వ్యాపారానికి అవరోధం కలిగించగల ఏ కాంట్రాక్టు అయినా సరే, ఏ కంపెనీలకలయిక అయినాసరే.... లేదా, లాలూచీ అయినా సరే...చట్ట విరుద్ధం. రాష్ట్రాలలో ఎవరైనా గుత్త వ్యాపారం చేసినా, లేదా, వ్యాపారంలో ఏ ఒక భాగాన్ని గాని గుత్తకు పుచ్చుకోడానికి ప్రయత్నించినా, నేరం చేసిన వారవుతారు." తద్విధంగా అమెరికనులు తమ నిర్ణయం చేసివేశారు: ఆ నిర్ణయం ఇది: ఆర్థికస్వేచ్ఛ వుండవలసినట్టిది; దానిని కాపాడడానికి ప్రభుత్వం శాసనాలు చేస్తుంది. ఇలాగ శాసనాలు చెయ్యడం, వ్యాపారస్తుల ప్రత్యేక సౌకర్యాలమీద సూటిగా దెబ్బతీయడమే. తద్విధంగా, స్వేచ్ఛ అంటే ఎలా వుండాలో యూరపియనులకంటే బహుశా తమకే ఎక్కువ తెలుసునని అమెరికనులు నిరూపించుకున్నారు.

"ధనాన్ని మించినది కృషి"

అబ్రహాం లింకన్ 1861 డిసెంబరు 3 వ తేదీన కాంగ్రెసుకు ఇచ్చిన సందేశంలో ఇలా పేర్కొన్నాడు:

"మీరు శ్రద్ధగా వినాలని...నేను కోరుతున్న....ఒక విషయం వుంది. కార్మికులకు ఇచ్చినంత ప్రాముఖ్యం కంటె

హెచ్చుగా కాకపోయినా, కనీసం దానితో సమాన ప్రాముఖ్యాన్ని పెట్టుబడి ధనానికి యివ్వడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నదనేది ఆ విషయం. ధనం పెట్టుబడి పెట్టడమనేది లేని కాలంనుంచీ కార్మికులున్నారు. దానితో కార్మికులకు నిమిత్తం లేదు. పెట్టుబడికంటె మించినది శ్రమ. అందుచేత శ్రమ ఇంకా ఎక్కువ విలువ నివ్వతగ్గది. పెట్టుబడిదారులకు తమకు ఉండవలసిన హక్కులున్నాయి; శ్రామికులకు, పెట్టుబడిదారులకూ పరస్పర ప్రయోజనకరంగా ఏ సంబంధమూ లేదని ఎవరూ అనడం లేదు; బహుశా ఎల్లప్పుడూ ఉభయులకు సంబంధం వుంది. పొరపాటు ఏమిటంటే, ఆ సంబంధం వుంటేనే కార్మికులు మనగలుగుతారని అనుకొనడం." లింకన్ మాటలు ఊరికే పోలేదు. ముఖ్యంగా 1880-1890 మధ్య కార్మికులకు ప్రయోజన కరంగా అనేక చట్టాలు చేశారు. ఈ విషయంలో మాసచుసెట్స్ రాష్ట్రం 50 సంవత్సరాలపాటు ముందడుగు వేస్తూ వచ్చింది. దానిని అనేక ఇతర రాష్ట్రాలు అనుకరించాయి. కేంద్ర ప్రభుత్వం చట్టాలు చేసింది. ఆ రోజులలో కార్మికులను గురించి అమెరికా చేసిన చట్టాలు యూరపియన్ రాజ్యాలు చేసినవాటికంటె చాలా అభ్యుదయకరంగా వున్నాయి. బహుశా అమెరికన్ చట్టాలు బ్రిటన్‌లో జరిగినవాటంత గొప్పగా లేవు. కాని, బ్రిటన్‌లో జరిగినట్టు కాక, అమెరికాలో ఈ చట్టాలు, కార్మికులలోనూ, బౌద్ధిక జీవులలోనూ సోషలిజం గట్టిగా పాదుకొనక పూర్వం సరియైన సమయంలో చేయబడ్డాయి. ఆ విధంగా ఇప్పటి అమెరికన్ కాపిటలిజానికి అంకురార్పణ మాత్రమే జరిగింది; అయినప్పటికీ, బలీయమైన కాపిటలిజంలో కార్మికులు మొదలైనవారికి రక్షణ ఇవ్వడానికి వీలున్నదని చూపడానికి అది చాలు.

కార్మికోద్యమం మూడవ విషయమేమంటే 1881 – 1886 సంవత్సరాల మధ్య అమెరికన్ కార్మికుల ఫెడరేషన్ నెలకొల్పబడడం, సోషలిజంతో ఎటువంటి పోలికలేని కార్యక్రమాన్ని అది ఆమోదించడం జరి

గాయి. అమెరికన్ కాపిటలిజం ఈనాడు అనుసరిస్తున్న మార్గాన్ని నిర్మించిన నాయకులలో గోంపర్స్, స్ట్రాసర్ అనేవారిద్దరున్నారు. వీరిలో గోంపర్స్ బ్రిటన్ లో జన్మించాడు; స్ట్రాసర్ జర్మనీలో జన్మించాడు. "లేబర్ ఇన్ అమెరికా" అనే పుస్తకంలో ఫాక్నర్, స్టర్‌లు వీరినిగురించి ఇలా వ్రాశారు: "కార్మికులకు కావలసినదేమిటని శామ్యూల్ గోంపర్స్‌ను ప్రశ్నించగా, 'ఇంకా ఎక్కువ ఇవ్వాలి; ఈ క్షణమే, ఇక్కడే ఇవ్వాలి,' అని ఆయన సమాధానమిచ్చాడు. ఎక్కువ అంటే కార్మికులకు మరింత జీతం, ఇంకా తక్కువ పని గంటలు, పనులు చేసుకోడానికి ఇంకా మంచి పరిస్థితులు, మరింత విద్యాభ్యాసం, వారికీ వారి కుటుంబాలకూ మరింత సౌఖ్యం మొదలైనవి. వారి జీవన ప్రమాణాన్ని పెంచి, సంఘంలో వారి గౌరవాన్ని హెచ్చించేది ఏదైనా సరే మరింతగా కావాలని కార్మికులు అడుగుతారు." పశ్చిమ యూరప్‌లో సోషలిజం కార్మికులను తన చేతిలోకి తెచ్చుకోగలిగింది; అమెరికాలో సోషలిజం అటువంటి ప్రయత్నం చేసి, విఫలమైంది. అమెరికన్ కార్మిక సంఘాలు వృద్ధిలోకి వచ్చిన మార్గాలను యూరపియన్ కార్మిక నాయకులలో అధిక సంఖ్యాకులకు ఊహించడమన్నా, అర్థం చేసుకొనడమన్నా తరచు అసాధ్యంగా వుంటాయి. ఇదివరకే చెప్పినట్టు, 1935 లో నెలకొల్పబడిన పారిశ్రామిక సంస్థల కమిటీలో (పిదప దానిని కాంగ్రెసు అన్నారు) కొందరు సోషలిస్టులున్నారు. కాని, "జీవించడం, స్వేచ్ఛగా వుండడం, సౌఖ్యాన్వేషణ జరుపుకొనడం" అనే సూత్ర దృష్టితో చూస్తే, సమష్టి వ్యవస్థవలన, పరిశ్రమలను జాతీయం చేయడంవలన అతి వినాశకర ఫలితాలు కలుగుతాయని కాలక్రమేణ కార్మికులకు అర్థమైన కొలదీ పారిశ్రామిక సంస్థల కాంగ్రెసుకూడా అమెరికా కార్మికుల ఫెడరేషను అనుసరించిన ధోరణికి వచ్చింది. ఈ నాడు అమెరికన్ కాపిటలిజానికి కార్మిక సంఘాలు వ్యతిరేక శక్తిగా వుండక, దానిని సుస్థిరంగా కాపాడే శక్తి అయాయని చెప్పాలి.

ఇతర అంశాలు అమెరికన్ కాపిటలిజం ఒక స్వరూపం దాల్చడానికి తోడ్పడిన పై ఆరు ముఖ్యాంశాలకూ చేర్చవలసినవి మరికొన్ని వున్నాయి: అమెరికాకు అసంఖ్యాకంగావచ్చిన వలసదారులను తమ పూర్వపు దేశంలోని సాంప్రదాయాలేమి, కోరికలేమి, ద్వేషాలేమి బాధించలేదు; అమెరికనుల సంపాదనతో పోల్చినప్పుడు వారి సంపాదన స్వల్పమే అయినప్పటికీ, తమ పూర్వపుదేశంలో సంపాదనతో పోల్చుకుంటే తగినంత ఎక్కువవుండేది; అమెరికా సరిహద్దులు బందోబస్తులు గలవి కావు; ఇందువల్ల 19 వ శతాబ్దమంతా తెరిపిలేనంతమంది అమెరికాకు వలస రావడానికి వీలుపడింది; సరిహద్దులను బందోబస్తు చేయకూడదని ఆనాడు అమెరికనులకు వున్న వైఖరి ఈనాటికీ బలంగా వుంది; వస్తువులను ప్రజానీకంకోసం కొల్లలుగా ఉత్పత్తి చేయాలనీ, కార్మికులందరూ ఈ వస్తువులను కొనుక్కునే ప్రజలేననీ గ్రహించారు; యూరపియన్ రాజ్యాలకంటె అమెరికా ఎక్కువ శాంతిననుభవించింది;—ఇటువంటివన్నీ కూడా అమెరికన్ కాపిటలిజం ప్రస్తుత స్వరూపానికి తోడ్పడ్డాయి. వీటిలో ఏది సరిగా ఎంత పాత్ర వహించిందో ఎవరూ చెప్పలేరు; కాని, అనేక సమస్యలతో కూడి, ఆ సమస్యలను తనంతట తనే పరిష్కరించుకోగలిగిన ఒక విధానం జనించడానికి మాత్రం ఇవన్నీ సాయపడ్డాయి.

లోపాలు, అభివృద్ధి, స్వేచ్ఛ అమెరికా కాపిటలిజంలోవున్న దుర్లక్షణాలను తరచు విమర్శిస్తూ వుంటారుగాని, దానిలోవున్న సల్లక్షణాలను చెప్పుకోరు. దాని వలన కలిగిన ఫలితాలను చూచినా, భావిలో అమెరికా ఆర్థిక రంగం ఏ విధంగా వుండబోతుందో ఆలోచించినా, నిరంకుశత్వ రాక్షసిని నిరోధించడానికి అమెరికన్ కాపిటలిజం వహిస్తున్న పాత్రను గమనించినా ఈ విధంగా విమర్శించడం భావ్యం కానేరదు. ఆదర్శ ప్రాయమైన సమాజాన్ని దృష్టిలో పెట్టుకొని చూచినట్లయితే ఉదార వాదులకు అమెరికా ఆర్థిక స్వేచ్ఛా విధానంలో అనేక పరిమితులు, లోపాలు వున్నవని తెలుస్తుంది;

అయితే, ఆదర్శ సమాజ సృష్టికి అది ఎంతవరకు తోడ్పడుతుందనే విషయాన్ని దృష్టిలో పెట్టుకొని చూస్తే ఇప్పుడు ఆచరణలో వున్న మిగతా అన్ని ఆర్థిక విధానాలకంటె కూడా అది ఉత్తమమైనదని తెలుస్తుంది; అంతేకాక, కాపిటలిజంలో స్వేచ్ఛవుండనే వుంది కనుక. ప్రజలు అభివృద్ధిని కాంక్షించి, ఆ అభివృద్ధికోసం కృషి చేసినట్లయితే అది సాధ్యమౌతుంది.

---

స్మిత్ కాలేజిలోను (మాసచుసెట్స్), బెన్నింగ్టన్ కాలేజిలోను (వెర్మాంట్) మాసిమో సాల్వడోరి చరిత్రాధ్యాపకుడుగా పని చేస్తున్నాడు. ఈయన తల్లిదండ్రులు బ్రిటిష్, ఇటాలియన్ జాతివారు. మాసిమో సాల్వడోరి ఇటలీలో పెరిగాడు. ఇటలీ ఫాసిస్టు పరిపాలనలో వుండగా ఈయన, ఈయన తల్లిదండ్రులు అనేక హింసల పాలయారు. ప్రపంచ యుద్ధకాలంలో ఈయన ఇటలీలోని బ్రిటిష్ ప్రత్యేక సైనిక దళంలో చేరి పని చేశాడు: సైనికాధికారులు ఈయన్ని డి. ఎస్. ఓ., ఎం. సి. పతకాలిచ్చి బహూకరించారు; ఇటలీలో మిత్రరాజ్య సైన్యాలకూ, ఇటలీ ప్రతిఘటనోద్యమానికి కేంద్ర వర్గమైన ఇటలీ జాతీయ విమోచన సంఘానికీ ఈయన లైజాన్ ఆఫీసరుగా నియమించబడ్డాడు. యుద్ధం జరుగుతున్న చివరి కొలది నెల్లలో ఈయన శత్రువులు ఆక్రమించిన ప్రాంతంలోవుండి పనిచేశాడు. యుద్ధం తరువాతనుంచి సాల్వడోరి అధ్యాపకుడుగా పని చేస్తూనే, ప్రపంచ సాంస్కృతిక సంఘ కార్యాలలోనూ, ఉత్తర అట్లాంటిక్ సంఘ సంస్థ కార్యాలలోనూ కూడా పని చేస్తూ వచ్చాడు. సాల్వడోరి "The Rise of Modern Communism", "Problem di Liberta" మొదలైన గ్రంథాలు రచించాడు. Liberal International వారు ఏర్పాటు చేసిన స్వాతంత్ర్య పాఠశాలకు (School for Freedom) ఈయన 1955-లో డైరెక్టరుగా పనిచేశాడు.

